ఓం

# అనన్యాచల పరిపూర్ణ ప్రబోధ

## రాజయోగీయము







అచల ఋషి

దయానంద పొన్నాల రాజయోగి

విరచితము

౦ఓం

౦౧౦

శ్రీ గురుభ్యోనమః

# అనన్యాచల పరిపూర్ణ ప్రబోధ

## రాజయోగీయము


అచలఋషి

దయానంద పొన్నాల రాజయోగి

విరచితము



ప్రథమ ముద్రణ

(1000 ప్రతులు)

శివాజీ ప్రెస్

సికింద్రాబాద్





1971

[మూల్యము రూ॥ **4.00**

అనన్యాచల పరిపూర్ణ ప్రబోధ రాజయోగీయము



# విషయ సూచిక

శ్రీ [illegible]

శ్రీమద్వయానంద పొన్నాల రాజయోగీంద్రులవారి ప్రియశిష్యులు



శ్రీ కోటపాటి కృష్ణారావుగారు, B.A.,

వీరి సతీమణి

రమాకుమారిగారు

శ్రీ గురుభ్యోనమః

# అనన్యాచల పరిపూర్ణ ప్రబోధ రాజయోగీయము

## పీ ఠి క

దుఃఖభూయిష్టమైన జననమరణ ప్రవాహము నుండి బయటపడు నుపాయ మేది యని సృష్ట్యాది నుండియు వివేకులైన మానవులు విచారణ సాగించుచునే యున్నారు. అందు, కొందఱు తమబుద్ధి కందునంత వఱకు తత్త్వ జిజ్ఞాస గావించి మూలకారణమైన ఆదితత్త్వమును చేరుకొనుటయే పరమావధిగాను, జన్మ తరుణోపాయముగాను నిశ్చయించి, వారి వారి సిద్ధాంతములను వాటికి తగిన ఆచార విచారములను నిర్ణయించి గ్రంథస్తము గావించి యున్నారు. భిన్నభిన్న వ్యక్తులు, భిన్నభిన్నములగు సిద్ధాంతములను సాధన మార్గములున్ను ఏర్పఱచినందున, భిన్నభిన్న సాంప్రదాయములు, పీఠములు, మందిరములు యేర్పడినవి. "శృతయశ్చ భిన్నః, స్మృతయశ్చ భిన్నః। మహాఋషీనాం, మతయశ్చ భిన్నః" అన్నట్లుగా, మత మతాంతర సిద్ధాంతము లెన్నో ప్రవర్తిల్లినవి. ఇవి మత దురభిమానములకు దారి తీయుటచే సమాజమునకు మేలుకన్న కీడే కలిగిన దనవచ్చును.

శ్రీధరస్వామివద్ద ధర్మోపదేశముగైకొని, శ్రీమద్రామడుగు శివరామ దీక్షితులను మహాత్ముడు, మత వాదములకు మూలకారణమైన "మతి" (లేక బుద్ధి) యొక్క మూలకారణము అనాదియైన ఆదితత్వమేనని గుర్తెఱిగి కార్య కారణరహిత స్థితియందు, స్వతస్సిద్ధమైయున్న పరిపూర్ణ పరబ్రహ్మము యొక్క ప్రతిపాదన గావించి పరిపూర్ణ బోధను సిద్ధాంతీకరించి యున్నారు. యీ బోధ అనన్య సామాన్యమైనది, జన్మకారణమైన వస్తువు నందలి భ్రాంతిని సమూలముగా నాశనము గావించునది.

శ్లో॥ విద్యాంతం, బ్రహ్మ విద్యాంతం । వార్తికాంత మగోచరమ్ ।
పూర్ణబోధ ప్రవక్ష్యామి । శృణు శిష్య మహోత్తమమ్ ॥

అనిన, విధముగా, యీ పరిపూర్ణబోధ ఆధ్యాత్మ బ్రహ్మనిర్ణయ పద్ధతు లగు అద్వైత వార్తీక సిద్ధాంతముల కతీతమైనది, గనుకనే, అనన్య సామాన్యమైనది. అనగా సాటిలేనిది, సర్వాతీతమైనది.

ఈ పరిపూర్ణ బోధ, సనాతనమైనదేగాని, నూతనముగాదు. శ్రీశివరామ దీక్షితుల వారిచే పునరుద్ధరింపబడుటచే, ఆయన యీ బోధకాచార్య పురుషుడనుటయు, ఆయన పేర నీ బోధ ప్రవర్తిల్లుటయు తటస్థించినది.

స్వార్థరహితముగా, అనగా, కర్తృత్వ త్యాగపూర్వకముగా కర్మలాచరించు శక్తి యుక్తులను ప్రసాదించు నీ పూర్ణబోధ గృహస్థులైన వారికెంతయు తగి యున్నది. "సర్వసంగ పరిత్యాగులైన సన్యాసులకు గూడ దురవగాహమై, అగోచరమై యుండు నీ పూర్ణబోధ, గృహస్థులకు సులభసాధ్యమగు టెట్లు?" అనే అశంక కలిగినవారు తమ సంశయ నివృత్తికి నీ గ్రంథము పఠించి భ్రాంతిరహిత కర్మాచరణ మొనర్చుచు, తాము తరించి యితరుల తరుణోపాయమునకై తోడ్పడగలరని యీ గ్రంథము రచించడమైనది.

కోటపాటి పున్నయ్యగారు, వీరి ధర్మపత్ని యగు రఘుపతమ్మ గర్భ జనితమగు కృష్ణారావు, యితని పుట్టుకతోడనే తల్లి పరమపదించి నందున గుంటూరు జిల్లా, రేపల్లె తాలూకా, మంత్రిపాలెం వాస్తవ్యులు అమ్మమ్మగారగు గోగినేని మహాలక్ష్మమ్మ యీతనిని అల్లారు ముద్దుగా పెంచి విద్యాబుద్ధులు గరపి అలపర్తివారి కుటుంబము నుండి రమాకుమారి యనే కన్యారత్నమును వివాహ మొనర్చి తన కున్నటువంటి స్థిరచరాస్తులు యిచ్చి ఆశీర్వదించి యుండగా, వారి పూర్వజన్మ పుణ్య విశేషముచే శ్రీమదచలబుషి రామడగు శివరామదీక్షిత పీఠాధికారులగు అచలబుషి దయానంద పొన్నాల రాజయోగీశ్వరుల ఆశ్రయించి, ధర్మోపదేశముబొంది శక్తిద్వయ నిరసన క్షరాక్షరోపాది ద్వయదోషరహిత పరిపూర్ణ తత్వమును తెలుసుకొని, జనన మరణ భ్రాంతి రహిత పరిపూర్ణ స్థితిని బొంది కృతార్థులైరి. తద్వత్తుగా, సోదర మానవులు కృతార్థులగుటకొఱకు యీ గ్రంథరాజమునకు కావలసిన ద్రవ్య సహాయ మొనర్చి ముద్రింప జేసిరి.

ఇట్లు,

పీఠాధిపతి

శ్రీమదచలబుషి

దయానంద పొన్నాల రాజయోగి

గ్రంథకర్త.

సికింద్రాబాద్.

ఓం

శ్రీగురుభ్యోనమః

# అనన్యాచల పరిపూర్ణ ప్రబోధ

రాజయోగీయము

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణు గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మా తస్మై శ్రీ గురువేనమః ॥

## పరిపూర్ణ నిర్ణయము

పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ, పూర్ణ మేవాఽవశిష్యతే॥

తా॥ సకలదేశములయందు, సర్వకాలములయందు, సమస్త వస్తువులయందు, నిండి నిబిడీకృతమై సూది మోపుటకైననూ సందులేక, చలించక, ఏకరీతిగా వున్నదేదో, ఆ పరిపూర్ణము దేనిచేతనూ తెలియరాక పరోక్షముగానున్నది.

కార్యరూపముగానున్న జగత్తుయందు కారణరూపంగానున్న పరమాత్మ, సువర్ణాభరణములయందు సువర్ణమువలె, సంపూర్ణముగా నిండియుండుటచే యిదియును పూర్ణరూపంగానే యున్నది. తెలియబడుచూ నున్నది. ఈ రెంటిలో పరోక్షరూపముగానున్న పరిపూర్ణము అతీతమై రెండవది లేకపోవుటచేత బాహ్యాభ్యంతరములనే నిర్ణయంలేక ప్రత్యక్షపూర్ణమును అతిక్రమించి వున్నది. విచారించిచూడగా ప్రత్యక్ష పూర్ణమగు యీ జగత్తు (కారణంతో సహా) "యదృశ్యం తన్నశ్యం" అనే న్యాయంగా లేనివస్తువే అయిపోవుచున్నది. పరోక్షంగానున్న

పూర్ణమే ఎప్పటికీ శేషించి సత్యస్వరూపమైయున్నది. కనుక దాన
పరిపూర్ణమని వ్యవహారార్థము పేరు వచ్చినది.

## ప్రత్యక్ష పూర్ణనిర్ణయము

నేను అనేకంగావలె (శ్రుతి:- అహం బహుస్యాం) నని, జీవేశ్వర
జగద్రూపంగా వికాసంజెంది, పంచభూతములుగాను, సూర్యచంద్రాది
నవగ్రహ నక్షత్రరూపంగానూ, కాలత్రయములుగానూ, తానే వ్యాపించి
యున్నను. ఎక్కడికక్కడ పరిమితరూపంలోనే వున్నది. దీపమొక
చోటనే యుండినను, దాని ప్రకాశము కొంతవరకు వ్యాపించియుండు
నట్లుగా అహం అను గుర్తు ఒకచోట యుండినను, దాని విషయావర
ణము ఆపాదమస్తకము వ్యాపించి మితమయ్యును పూర్ణముగనే
వుండును. శరీరమునందే అవస్థాత్రయములు చెందుచుండును. సంకల్ప
వికల్పములు చేయుచుండును. సముద్ర మెంతవరకు వుండునో అంత
వరకే దాని కెరటములుండునట్లు, అని, తెలియవలెను. చీమ యెంత
వున్నదో దాని తెలివి అంతవరకూ వ్యాపించును. యేనుగునందుండు
తెలివి యేనుగెంతయుండునో అంతగానూ యుండును. ఈ విధంగా
వ్యాపించిన అహం పదార్థము యెక్కడికక్కడ వ్యాపించియుండుట
వలన నిదియును పూర్ణమని చెప్పబడినది. ఈ అహం పదార్థమునకూ
మూలము అహమేకాని పరోక్షముగానున్న పరిపూర్ణ బ్రహ్మము కాదు.
ప్రత్యక్షపూర్ణమే సర్వకారణము. ఇట్టి కారణబ్రహ్మమునకంటె అతీత
మగునది ఏదీలేదని యితరులంటున్నారు. ఈ కారణబ్రహ్మము నిరింద్రియ
మైన శుద్ధ మనస్సునకు గోచరమై నేనే బ్రహ్మమని యనదగియున్నది.

అట్టి కారణబ్రహ్మము అచలపరిపూర్ణబ్రహ్మ మెన్నడూకానేరదు.
అదే పరిపూర్ణము అంతకంటె ఏమీలేదు అనుమాటలు గురు కృపా
విహీనులై, తాము మునిగినదే గంగ యనుకొనువారి మాటలు
మాత్రమే. అవి కేవలము భ్రాంతిజన్యములు. మానవలోకమును

భ్రాంతిలో ముంచునవియునై యున్నవి. కనుక కారణబ్రహ్మమైన ప్రత్యక్షపూర్ణము అతద్వ్యావృత్తి లక్షణముచే నిరసింపదగినదే. దీని రహితమునందు శేషించినదేదో అది ప్రత్యక్షపూర్ణమును అతిక్రమించి యుండు పరోక్షపూర్ణము. అదే కేవల పరిపూర్ణ పరబ్రహ్మము.

## మానవ సృష్టి

"సోఽకామయత బహుస్యాం ప్రజాయేయ" అనగా తానే అనేకము కావలెనని పరమాత్మకోరెను. అట్టికోరికననుసరించి, ఆ సంకల్పానుసారం యెనుబదినాలుగు లక్షల జీవరాసులు ఆయననుండియే ఆవిర్భావముచెందెను. పిదప "తత్సృష్ట్వా తదేవాఽను ప్రావిశత్" వాని సృజన అయిన పిదప వానియందు తానే జీవరూపముగా *అనుప్రవేశము గావించెను.* సృష్టియే ప్రథమప్రవేశము. జీవప్రవేశమే *అనుప్రవేశము* అనగా పునఃప్రవేశము. జీవునిప్రవేశము ఏ ద్వారముగుండా జరిగెను? అన్నిద్వారములయందు ఆ యా ఆధ్యాత్మిక ఆధిదైవతములు నిండియుండి సందులేనందున, మానవశరీరమందలి కపాలములోని బ్రహ్మరంధ్రముగుండా ప్రవేశించి హృదయమున నివాసస్థానమేర్పరుచుకొనెను. తోడనే సర్వేంద్రియములకు చేతనము కలిగెను. మానవాంతఃకరణము సత్వగుణాధిక్యతగలది గనుక దీనియందాత్మప్రకాశము యెక్కువ. విద్యుత్ప్రకాశము బల్బుయొక్కశక్తి ననుసరించియుండునుగదా!

మానవుని విశిష్టతయేమి? జ్ఞానేంద్రియములచే విషయపంచకమును దెలిసికొని, అంతఃకరణమునకుచేర్చి, వాని యుక్తాయుక్తములను బుద్ధిచే నిశ్చయించి కర్మేంద్రియములతో కర్మచేయును. ఆ యా కర్మల యొక్క అదృష్టఫలము అంతఃకరణమందు గుర్తుగా (సంస్కారముగా) నిలచియుండును. మరియును తన్నుతా తెలుసుకొనగల్గియున్నందున, తానే పరమాత్మననే జ్ఞానము, యొక్క మానవోపాధియందే సాధ్యము. ఇట్టి సత్యాఽసత్యవివేక నిశ్చయజ్ఞానములు యితరోపాధులయందు లేవు.

కనుక అట్టి మానవోపాధిలభించుటయే మహా అదృష్టమని, యిట్టి సదవకాశమును చేజేతులార, జారవిడుచుకొనుటకన్న దురదృష్టము మరి వేరే లేదని తెలియనగును. ఏలననగా సత్కర్మానుష్ఠానముచే శుభసంస్కారములను సృష్టించుకొని యుత్తమమగు జన్మలకు పోగల్గు చున్నాడు. లేదా సర్వసంస్కారనాశనముగావించుకొని జన్మరాహిత్య మునే సాధించుచున్నాడు. కనుక సత్యాసత్యముల గుర్తెరుగగల అఖండ జ్ఞానసంపత్తి, తన స్థాన స్వరూప స్వభావములు తనకతీతమైన పరిపూర్ణ బ్రహ్మమున్నూ గుర్తెరిగి తాను జన్మరాహిత్యమును సాధించు శక్తి యుక్తులు ఒక్క మానవోపాధికేగలవు. కనుకనే మానవజన్మ దుర్లభ మని, మహాశ్రేష్ఠమని, దానిని నిరర్థకముగావించుకోవద్దని పెద్దలుదో్బ ధించుచున్నారు.

## పురుషకారము

గత జన్మార్జిత పుణ్యవిశేషముచే నీకు మానవత్వము సిద్ధించిన దన్నమాట యదార్థమేగాని "సంతానము, ఐశ్వర్యము, భోగభాగ్య ములు పుణ్యాత్ములకే. నేను పాపాత్ముడను కనుక నాకు కొరత యేర్పడినది." అని యెంచుట వెర్రితనము. నీవు సర్వస్వతంత్రుడవు. సర్వసామర్థ్యములు నీకున్నవి. నీ ప్రజ్ఞచే నీవు సాధించలేనిది లేదు. పరమాత్మసృష్టియందు అందరికి ఆకలిదప్పిక నిద్రామరణము నిర్ణయింప బడినవి. పంచభక్ష్యాన్నములైనను, గంజిమెతుకులైనను ఆకలిచల్లార్చు టకు సమానమే. దప్పికదీర్చుటకు పరిశుద్ధజలములైనా మధురపానీయము లైనా సమానమే. నిద్రరావలెనేగాని, నిద్రయందు విశ్రాంతిచేకూరు టకు కటికనేలయైననూ హంసతూలికాతల్పమైననూ సమానమే. మరణదేహమును మంటిలో పూడ్చిపెట్టినా, బంగారుమందసములోనుంచి ఆపైన మహాసౌధములునిర్మించినా యొకటే. పేడపిడుకలతో మంట బెట్టినా, చందనతరువులతోనూ గోఘృతాదులతోనూ దహనక్రియ

గావించినా యొకటే. కనుక క్షుత్పిపాసాసుప్తి మరణములయందు ఫలానుభవమేకరూపముగనే యున్నది. దానధర్మాదులుచేయువారందరూ పుణ్యాత్ములు. నేను చేయలేనుకనుక నేను పాపాత్ముడననిభావించి, నిన్ను నీవు కించపరచుకొనరాదు. కావలసినది అంతఃకరణ పరిశుద్ధి. దానికొరకై సత్కర్మానుష్ఠానము చేయవలెను. "పరోపకారాయ పుణ్యాయ పాపాయ పరపీడనం" అన్న సూక్తిని మరువక నీకున్న బలధనవిద్యాదులవలన యితరులకు మేలుచేయుటకు ప్రయత్నించు. నేను పాపాత్ముడను. నే నీ దరిద్రబాధననుభవించవలసినదేనని నిస్పృహ వహించి, సోమరివై, నిన్ను నీవు పాడుచేసుకోకు. "కృషితో నాస్తి దుర్భిక్షం" అనున్యాయంగా పురుషార్థములు సాధించుకో. నీకున్నదాని ననుభవించుటకైనను నీ పురుషప్రయత్నములేనిదే సాధ్యముకాదుకదా! పదార్థములన్నియున్నా పచనక్రియచేయనిదే వానినెట్లు భుజించగలవు ? పూర్వాపూర్వ మహర్షుల విజ్ఞానధనమంతయు నీ కొరకు నీ గురుదేవునికి పరంపరగా సంక్రమించియున్నది. సద్గురువు నాశ్రయించి జన్మసార్థకము గావించుకో !

పాపపుణ్యముల భయభ్రాంతులు అజ్ఞానులకే. శరీరాభిమానులకే నేను పరమాత్మస్వరూపుడను, సర్వపరిశుద్ధుడను. అను ఆత్మదృష్టితోనే యుండు. "పాపోహం, పాపకర్మాహం, పాపాత్మా, పాపసంభవా" అంటూ కూర్చుంటే పాపవిముక్తి అవుతుందా ? "యాదృశీభావనా యత్రతాదృశీ భవతినిశ్చయం" అన్నట్లుగా నీవు పాపివే యగుదువు ! నే నెట్లాగూ పాపినే యీ కొంచముపాపము చేస్తేమాత్రమేమి అని పాపకార్యములకు వెనుదీయవు. పాతనీళ్ళకాగుకు యింకా నుసియంటు నేమోయని భయముంటుందా ? కనుక నీ పురుషకారముచే సత్కర్మాను ష్ఠానముచేసి అంతఃకరణశుద్ధి గావించుకొంటివేని అచిరకాలముననే జ్ఞానోదయమై గురూపదిష్టమార్గముచే జననమరణభ్రాంతితోసహా సర్వ భ్రాంతిరహితము చేకూర్చుకొందువు.

# పుణ్యపాపభ్రాంతి

మానవోపాధి యెంతశ్రేష్ఠమనిచెప్పుకొంటున్నా మానవుడనేక భ్రాంతులకు లోనై యున్నాడు. సర్వభ్రాంతులకు మూలం, మూలంలేని గుర్తెరిగేశరీరమన్నారు, దీక్షితులవారు. అది బ్రహ్మామనుకొనుటయే తొలిభ్రాంతి. అదే అన్నిభ్రాంతులకు మూలం. (1) కర్మభ్రాంతి లేక పుణ్యపాపములభ్రాంతి, (2) మహాత్ములయందుభ్రాంతి, (3) జీవేశ్వరైక్యభ్రాంతి, (4) సాధనారూపమైనభ్రాంతి, (5) నేనేబ్రహ్మానసే భ్రాంతి. అను భ్రాంతులు ముఖ్యములు.

# కర్మభ్రాంతి

(1) పుణ్యపాపాలభ్రాంతి:—తాను పాపాత్ముడుగనుక, సంతానము, ధన కనకవస్తువాహానములు, కీర్తి ప్రతిష్ఠలు, వుద్యోగహోదాలు తనకు కలుగలేదు అని యనుకొనుట అజ్ఞానము. ఈ అజ్ఞానమునకు తత్ఫలితమగు అసంతృప్తికి, పరమాత్మయొక్క సృష్టివిధానము, తన స్వరూపస్తితి, తనకు తెలియకుండుటయే కారణము. దానధర్మాది పుణ్యకార్యములుచేసి ఐహికాముష్మిక భోగభాగ్యములు పొందచూచుట స్వార్థము. తనకున్నచో తాను తినవచ్చును పదిమందికి పెట్టవచ్చును. కాని పుణ్యమాసించి చేయరాదు. తాను వారు అందరూ పరమాత్మ స్వరూపులే, కనుక యెట్టి ఫలాకాంతుగాని కర్తృత్వాభిమానముగాని లేకుండుటచేయుట శ్లాఘనీయము. పుణ్యము చేయనంతమాత్రమున పాపమంటదు. పుణ్యముగూడ హిరణ్యశృంఖలములవలె బంధించును. కేవలం సేవాభావముతోనే నేను పుణ్యకర్మలుచేస్తున్నానను అహంకారమున్నూ వుండరాదు. నేను పరమాత్మస్వరూపుడనై యున్నానని అనుకొనుటగూడ నహంకారమే. కనుక ఏమియు ననుకొనకుండా అసంగుడై, ఎట్టి పాపపుణ్యభ్రాంతియు లేక, సహజపద్ధతిగా స్వధర్మము ననుసరించి కర్మలొనర్చుచుండవలెను. తాను యితరులకంటె పుణ్యాత్ముడ

నని, లేక పాపాత్ముడనని అనుకొనరాదు. కనుకనే శ్రీకృష్ణదేశికేంద్రులు "పాపములు పుణ్యములు భువిప్రాపించును. యెరుకచేత భ్రమసినవారిన్ ప్రాపింపవెరుకనెడసిన తాపసులను, చిత్తమందు దగదెలుసుకొనుమీ" అని తమ కందార్థములలో సెలవిచ్చినారు. కనుక షడ్గుణైశ్వర్యములు తనకు గలుగవలెననే భ్రాంతితో పుణ్యకార్యములగు (1) సప్తసంతానములు, షోడశదానములుచేయుచు నవవిధధర్మములు నడుపుట పుణ్యభ్రాంతియే, అష్టాదశ జాతులలో నేనుత్తమజాతియందుద్భవించినానని యో లేక వుత్తమజాతి పురుషుడనై పుట్టుట ఎంతో అదృష్టమనియో లేక స్త్రీగాపుట్టినను అందు వుత్తమజాతి స్త్రీననియో నిర్ణయించుకొని తానధికుడనని యితరులు తనకంటె అల్పులనియు జాత్యభిమానము గలిగియుండుటయు భ్రాంతియే.

## మహత్తులయందలిభ్రాంతి

అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము అనునవి అష్టసిద్ధులని ప్రసిద్ధికెక్కినవి.

*1.* **అణిమ:—** అనగా, **తాను** అణుస్వరూపుడై యుండగల్గుట.

*2.* మహిమ:—అనగా తాను మహత్తుకంటె పెద్దవాడు కాగల్గుట.

ఈ రెండు సిద్ధులు సాధించినవారు, అణువు బ్రహ్మ పదార్థమువరకూగల ఏ ప్రమాణమునకైన దేహమును గొప్ప కురుచలుగావించగల్గును. ఈ రెండు సిద్ధులను సాధించినవాడు గనుకనే హనుమంతుడు మహాసముద్ర లంఘనముగావించుటలో సురసయనుదానిని జయింపగల్గెను. హనుమంతుడు రామకార్యమును సాధించగలడా లేడాయని పరీక్షింపదలచి, సురస ఆతనిని మ్రింగుటకై తన పెద్ద నోరును తెరచెను. మహిమ అను సిద్ధిచే హనుమంతుడు తనదేహమును పెంచ

సాగెను. సురస తననోటిని అంతకంటెనూ పెద్దదిగా పెంచు చుండెను. అపుడు హనుమంతుడు 'అణిమ' అను సిద్ధిచే అణు స్వరూపుడై ఆమె నోటియందు ప్రవేశించి వెంటనే బయల్వెడలెను.

3. *గరిమ:*— అనగా శరీరపుబరువును ఎంతైనను పెంచగలుగుట.

4. లఘిమ:— అనగా శరీరపుబరువును ఎంతవరకైననూ తగ్గించ గలుగుట.

ఈ రెండు సిద్ధులను ప్రదర్శించి శ్రీకృష్ణుడు సత్యభామ గర్వభంగము గావించెను. ఎట్లనగా నారదుడు, సత్యభామచే శ్రీకృష్ణుని దానముగా గ్రహించి, శ్రీకృష్ణునియెత్తు బంగారము సత్యభామ యిచ్చినచో నాతనిని ఆమె కమ్మి వేయుట కంగీకరించెను. సత్యభామ అందుకంగీకరించి శ్రీకృష్ణుని బంగారముతో కాటాలోతూచుట ప్రారంభించెను. తనకున్న బంగారమంతయు కాటాలోవేసినా శ్రీకృష్ణుడు దానికంటెను బరువై పోవుచూ నుండెను. యిదే గరిమయను సిద్ధి. అంతట సత్యభామ ప్రార్ధనచే రుక్మిణివచ్చి శ్రీకృష్ణునికి భక్తితో ప్రదక్షిణ నమస్కారమాచరించి ఒక తులసీదళమును తెచ్చి బంగారమున్న కాటాలో వేయగనే శ్రీకృష్ణుడు లఘిమ అను సిద్ధిని ప్రదర్శించి శరీరమును తేలిక గావించెను. దానితో సత్యభామకు గర్వభంగమయ్యెను.

5. *ప్రాప్తి:*— యిష్ట పదార్ధములను లభింపచేసుకొనుట.

6. *ప్రాకామ్యము:*— అనగా కోరుకొన్న విధముగా సర్వశక్తులు అనగా ఆకాశగమనాదులు చేయగలుగుట.

7. *ఈశత్వము:*— ఇంద్రియాధిష్ఠానదేవతలపై మాత్రమేగాక ముక్కోటిదేవతలను, అష్టదిక్పాలకులను, త్రిమూర్తులను సహితం శాసింపగల్గియుండుట.

8. వశిత్వము:— సర్వప్రాణులను వశముచేసికొని వానిచే యిచ్ఛ వచ్చినట్లు తన కార్యములను చేయించగల్గుట— ఈ సిద్ధు లుపయోగించిన వాని పారమార్ధిక జీవితమున యిక పురోభి వృద్ధి గాంచలేదు. కనుక ఈ సిద్ధులన్నియు ధనకీర్తి ప్రతిష్ఠ లకేగాని మరెందుకుకొరగావు. అంతేగాక అష్టసిద్ధులు ప్రయోగములో కల్గిన పుణ్యాపాపానుభవముకొరకు నీచోత్తమ జన్మపరంపర లెత్తవలసివచ్చును. కనుక ఈ భ్రాంతి సాధకునికి యెంతమాత్రముండరాదు.

# ఋణనిర్ణయము

పరమాత్మ నిర్ణయానుసారంగా జీవులు, నిర్ణీతప్రదేశములయం దుత్పత్తియై ఆహారపానీయములతో ఆకలిదప్పుల నివారణచేసికొని కాలానుగుణ్యంగా పెరిగి నశించుచున్నవి. వానికన్నిటికి అవసరమగు ఆహారపానీయములు, పర్వతారణ్యములలో, నదీనదములలో సిద్ధపరచ బడిన పిమ్మటనే ఆ యా వుపాధులు కల్పింపబడుచున్నవి. కాని విజ్ఞాన యుతుడగు మానవుడా యేర్పాటుతో తృప్తిపడక తానున్నచోటనే ఆహారాదులు తనకు లభించవలెననే ఆశతో, కొంతప్రదేశమును తనదిగా నిర్ణయించుకొని, అందు సస్యాదులను వేసి పండించుకొంటూ గృహా రామములను తత్సమీపముననే నిర్మించుకొని, గృహావరణముననందే జలముకొరకు కూపతటాకాదులను నిర్మించుకొంటున్నాడు. తన ఆనందముకొరకు వలచినస్త్రీని తెచ్చుకొని ఆమెతో కామోపభోగ ములు పొంది సంతానము గంటున్నాడు. తన సంతానమువలన తనకు పుణ్యగతులు కూడా లభించునని భ్రాంతితో వారి క్షేమముకొరకై అహరహము కష్టించుచున్నాడు. ఆ విధముగా ధనేషణ, దారేషణ పుత్రేషణలతో బద్ధుడగుచున్నాడు. తనయొక్కయు తన ధనదార సుతాదుల యొక్కయు క్షేమముకొరకు అన్యులకెంతటి యపకారము

చేయుటకున్ను కూడ వెనుదీయుటలేదు. తనవారియందు యిట్టి విపరీతమగు మమకారముపెంచుకొని తుదకు మరణించుచున్నాడు ఐనను, పూర్వవాసనలననుసరించి ఆ వంశమునందు ప్రేమబలీయముగానుండుటచే ఆ వంశమునందేతిరిగి జన్మించుచున్నాడు. ఇట్టి మోహామే నాతనిని యీ వంశమునకు ఋణగ్రస్తుని గావించినది. ఏలననగా ఆ కుటుంబ సభ్యులనుండి పూర్వపూర్వ జన్మలలో తాను ఆనందముపొంది యున్నాడు. కనుక అట్టి ఆనందము తనవలన వారికి లభింపచేయనిదే తన ఋణము తీర్మానముకాదు. కనుక తన తలిదండ్రులకు సోదర సోదరీలకు ఆనందముకల్గించుటయే ప్రతివానికిని విధి.

ఆ విధముగానే పూర్వజన్మలలో తన కుటుంబమువారు తనవలన యెంతగానో ప్రేమింపబడి తాను సమకూర్చిన వస్తుసంపదతో ఆనందించి యుండిరి కనుక వారుతనకున్ను ఋణపడియున్నారు. ఈ విధంగా ఒకరికొకరు ఋణపడియుండుటచే ఆదిలోనుండిన ప్రేమానుబంధమిపుడు ఋణానుబంధముగా మారినది. "ఋణానుబంధరూపేణ పశుపత్ని సుతాలయః ఋణక్షయం క్షయం యాతి కాతత్రపరివేదనా" అని చెప్పబడినవిధంగా అట్టి పరస్పరముగల ఋణవిముక్తి జరిగినపిమ్మట వారికి వియోగము తటస్థించును. ఋణానుబంధమువలననే భార్యా బిడ్డలు గృహారామ పశుసంపదలు మానవునికి ప్రాప్తించుచున్నవి.

మానవుడు, తానొక కుటుంబంలో జన్మించి, ఆ తలిదండ్రుల ప్రేమలో అల్లారుముద్దుగాపెరిగి పెద్దవాడై, ప్రయోజకుడై తన ఆనందముకొరకై, యొక కన్యారత్నమును తెచ్చి తలిదండ్రులు తనకు వివాహముసేయగా ఆమెతో నానందిస్తూ సంతానముగంటున్నాడు. తన సంతానము నెడల యెంతయో ప్రేమానురాగములు పెంచుకొని తన సంతానముగూడ తనయెడల నట్టి ప్రేమానురాగములేజూపి తన కానందముకల్గించవలెనని ఆకాంక్షించుచున్నాడేగాని తన తలిదండ్రులు తనయెడల నెంతటిప్రేమానురాగములుచూపి తన్నింతటివానిగా జేసిరో

విస్మరించుచున్నాడు. తనకు శరీరప్రదానముచేసిన ఆ తలిదండ్రులను పూజనీయులుగా భావించి సేవించుట లేదు సరిగదా, కనీసం, కృతజ్ఞతా పూర్వకముగానైనను వారియందు విశ్వాసమగుపరచుట లేదు. తాను తన భార్యాబిడ్డలతో వేరుగా కాపురమున్నచో యెక్కువ సుఖపడ వచ్చుననీ, తలిదండ్రులను సోదరసోదరీలను తానెందుకు పోషించవలెననీ యెంచి, వేరుకాపురం పెట్టినచో ఏమి జరుగును? ఆ కుటుంబమునకు తాను ఋణపడియుండి ఆ ఋణము తీర్చకనే మరణించినచో ఆ కుటుంబమునందు దాసదాసీరూపంగానో కుక్కగానో జన్మించి ఆ ఋణముతీర్చక తప్పదు.

కనుక ముఖ్యముగా జన్మరహితమునాశించి కృషిచేయువారు కర్మత్రయరహితముతోపాటు ఋణత్రయరహితముగూడ గావించు కొనవలసి వున్నది. తన ఆనందముకై యీ బ్రహ్మాండమునే నా కొరకు సృష్టించియుంచినవాడు దేవుడు. ఆ దేవునికే తాను ఋణపడి యున్నాడు. ఇది దైవఋణము. పిండాండమున తనకీ దేహము ప్రసాదించినవారు తలిదండ్రులు. కనుక వార్కిన్ని తాను ఋణపడి యున్నాడు. ఇది పితౄణము. సృష్టి విజ్ఞానమంతయు మాత్రమేగాక ఆ సృష్టియందు బద్ధుడై జన్మపరంపరారూప సంసారమున పరిభ్రమించు తనకు ఏతద్విమోచన విధానమునంతయు ఏర్చి కూర్చియుంచిన ఆ యచలఋషులకున్ను తాను ఋణపడియున్నాడు. కనుక ఈ ఋణ త్రయమునుండి తాను విముక్తిముపొందవలసివున్నది. కాబట్టి తన పూర్వా పూర్వ జన్మలయందలి ఋణరూపఫలితంగా యీ జన్మలో మానవుడే కుటుంబములో యే పరిస్థితులలో జన్మించెనో దానికి తలయొగ్గి ఋణ విమోచనము గావించుకొనుటయే కర్తవ్యము. కనుక యెట్టి పరిస్థితుల లోను, తలిదండ్రులను సోదరసోదరీలను వదలిపోయి వేరుగానుండుట కిచ్ఛయింపక వారితో కలసిమెలసి గంజిమెతుకులతోనైనను తృప్తి పడుచూ మాతాపితౄలయొక్కయు కుటుంబముయొక్కయు ఋణము

తీర్చవలయును. ఇట్టి పితృౠణము తీర్చక యెట్టి మహాపండితుడైననూ కడతేరలేడు. ధర్మవ్యాధుడు తలిదండ్రుల సేవాభాగ్య మాత్రమున ఎంతటి మహామహిమాత్ముడయ్యెనో, తలిదండ్రుల నుపేక్షించిన కౌశికుడు ఎంత మహాతపస్వియైననూ యెట్టి పరాభవమునొందెనో విమర్శించనగును. పితృౠణము కొంతవరకేతీర్చి పూర్తిగా తీర్చనివాడు అనగా వారిని యావజ్జీవము సేవించనివాడు ఋణశేషము తీర్చుటకై తప్పక మరల జన్మమెత్తవలసినదేనని గుర్తించవలెను.

## సప్తసంతానములు

స్వస్త్రీయందు పురుషునికికలుగు సంతానము ఆ దంపతుల పూర్వ పుణ్యావిశేషమునుబట్టి యిహపరసౌఖ్యదాయకమైయుండును. పితృౠణము దీర్చుటకై సత్పుత్రుడు తన బలధనవిద్యలన్నియు తలిదండ్రులను వారి వృద్ధాప్యమునందు కాపాడి సుఖపెట్టుటకు వినియోగించును. అట్లే వారి మరణానంతరసుఖమునకై తన తపోధనము సహితము ధారబోయును. అందుచే సర్వులును సత్సంతానాపేక్ష గల్గి యున్నారు. లోకహితముకొరకు పాటుపడగల పుత్రుడయ్యేనేని అంతకన్న తండ్రికింక ఆసించదగినదిలేదు.

సప్తసంతానములు అని చెప్పబడే (1) తటాకనిర్మాణము, (2) కూపఖననము (నుయ్యి త్రవ్వించుట), (3) నిధినిక్షేపించుట, (4) దేవాలయనిర్మాణము, (5) అగ్రహారనిర్మాణము, (6) వన ప్రతిష్ఠ, (7) కావ్యరచనము అనునవి భావితరములవార్కి యెంతో యుపయుక్తములై చిరకాలము ఆ పురుషుని కీర్తి భూమియందు నిలువగలదు. కనుక పురుషుడు సత్పుత్రునిబడయుట కెట్లాసించునో అట్లే యీ సప్తసంతానములనుబడయుట కభిలషించును. వీనివలన యిహలోకమునకలుగు కీర్తిప్రతిష్ఠలు మాత్రమేగాక పరోపకారరూప

మగు పుణ్యవిశేషము ఒక అపూర్వమగు అదృష్టమును సృష్టించి ఆతని
వుత్తరోత్తరజన్మలయందు మేలు గలుగగలదని నిర్ణయము.

## షడ్గుణైశ్వర్యములు

I. జీవుని షడ్గుణైశ్వర్యములు, క్షేమ, స్థైర్య, విజయ, ఆయు
రారోగ్యైశ్వర్యములు అను ఆరున్ను జీవునికి కల్గెనేని ఆతడాసించదగినది
మరేమిన్ని యుండదు. కనుక వీటికిషడ్గుణైశ్వర్యములని పేరు.

II. ఈశ్వరుని షడ్గుణైశ్వర్యములు.

శ్లో॥ ఉత్పత్తించ వినాశంచ, భూతానామాగతిం గతిం। వేత్తి
విద్యామ విద్యాంచ, షణ్ణాం భగయితీర్యతే॥ అనగా (1) సృష్టి
చేయుట, (2) ప్రళయములుగావించుట, (3) ప్రాణులయొక్క
రాకడ, (4) ప్రాణులయొక్క పోకడ తెలిసియుండుట, (5) జ్ఞానము,
(6) అజ్ఞానమునెరిగియుండుట అను ఆరు శక్తులు గల్గియుండుట భగ
మనబడును, అట్లు కల్గియున్నవాడే భగవంతుడనబడును.

(1) ఐశ్వర్యము (లేక మహాత్వము), (2) ధైర్యము,
(3) కీర్తి, (4) తేజస్సు, (5) జ్ఞానము, (6) వైరాగ్యము
ఐశ్వర్యమనగా = అణిమాది అష్టైశ్వర్యములు లేక అష్టసిద్ధులు అని
చెప్పబడే అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్య,
ఈశత్వ, వశిత్వములు.

1. **అణిమ:—** సర్వప్రాణులయందు అణుప్రమాణములోనున్న
ప్రాణులయందు సహితం సూక్ష్మాతి సూక్ష్మరూపమున
ఈశ్వరుడున్నాడుగదా.

2. **మహిమ:—** బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివుల
యొక్కయు వీనికి మూలమగు మూల మాయయొక్కయు
స్వరూపములనుగూడ నతిక్రమించి ఈశ్వరుడున్నాడుగదా!

3. *గరిమ:—* అనంతకోటి బ్రహ్మాండభాండముల ఏకైక సమష్టి వస్తువులకంటెను భారమై బరువుగల్గియుండుట.

4. *లఘిమ:—* మిక్కిలి తేలికయగు దూదికంటెను తేలికయై యుండుట.

5. *ప్రాప్తి:—* ఈశ్వరునికి కోరదగినదిలేదు. సర్వము నాతడే అయి సర్వస్వరూపుడాయెనుగదా.

6. *ప్రాకామ్యము:—* ఆకాశగమనాది సర్వశక్తులు గలిగినవాడు. దేహావయవములన్నియు ఆదేహికెట్లు స్వాధీనమో, అట్లే ఆదిశక్తినే తన స్థూలదేహముగాధరించిన వానికి సర్వశక్తులున్నట్లేగదా.

7. *ఈశత్వము:—* సూర్యచంద్ర అగ్నివాయువాది సమస్త దేవతలు వారివారి ఒక్కొక్కకార్యమునందే సమర్థులై వున్నారు. ఆ యా దేవతలనే యింద్రియములుగా ధరించిన ఈశ్వరునికి సర్వపరిపాలనాదక్షత యుండుటలో నేమియు నాశ్చర్యములేదు.

8. *వశిత్వము:—* సర్వప్రాణులును, ఈశ్వరునివలననే సృష్టిస్థితి నాశనములొందుచున్నవి కనుక అవి అన్నియు ఈశ్వరేచ్ఛకు బద్ధులైవుండుటయు సహజమే.

ఈ అష్టైశ్వర్యములు (సిద్ధులు) ఈశ్వరునికి సహజములై యున్నవి. ఈ సిద్ధులను సాధించుటకై జీవుడెంతో శ్రమపడి చివరకు సంపాదించినను ఆ యీశ్వరుని సంకల్పముచే ఆతని యాయువాదినము ననే పరిసమాప్తి కావచ్చును. వుదాహరణకు ఈశ్వరుని మెప్పించి హస్తమస్తకసంయోగముచే సర్వప్రాణులను భస్మీపటలముచేయు శక్తి సంపాదించిన భస్మాసురునిగతి ఏమయ్యెను? స్వాత్మవినాశనము నకే దారితీసెనుగదా! అట్లే యీ అష్టసిద్ధులను ఆత్మహత్యా సదృశము

లని గుర్తించవలెను. ఏలననగా మానవజీవితము యెంత అమూల్యమో అంత క్షణికము. అట్టి అమూల్యమగు మానవజీవితమును అష్టసిద్ధుల సంపాదననిమిత్తమున్ను తదనంతరం ధన కీర్తి ప్రతిష్ఠలకోసరమున్ను లేదా రాక్షసులవలె లోకమును హింసించుటయందునూ వినియోగించిన వాడు క్షణికమగు విషయానందముపొంది, శాశ్వతమగు మోక్ష సామ్రాజ్యమును కాలదన్నుకొనుచున్నాడు కనుక వానికంటె మూఢు డింకొకడుండజాలడు.

మానవుడెంతటి మహత్తులు సాధించిననూ ఈశ్వరునితో పోటీ చేయజాలడని సూచించుటకు ఆతని షడ్గుణైశ్వర్యసంపత్తి మరియొక విధముగాకూడ నిర్ణయింపబడినది.

(1) సర్వకర్తృత్వము, (2) సర్వభోక్తృత్వము, (3) సర్వ పాలకత్వము, (4) సర్వనియంతృత్వము, (5) సర్వసంహారకత్వము, (6) సర్వేశ్వరత్వము.

ఇట్టి షడ్గుణైశ్వర్యసంపత్తి మానవునకెన్నడున్ను లభింపజాలదు గదా! గనుక స్వాత్మగౌరవము పాటించక తన్నుతాను నీచ పరచు కొనుట యెంత నికృష్టమో స్వల్పశక్తులను సాధించి తానే భగవంతుడ నని విర్రవీగుటయు అంత అపచారమే.

## షోడశమహాదానములు

శ్లో॥ గావో, హిరణ్యం, రజితం, రత్నానిచ, సరస్వతీ
తిలాః, కన్యా, గజా, శ్వచ్ఛ, శయ్యా, వస్త్రం, తదామహీం
ధాన్యం, పయస్వినీ, ఛత్రం, గృహా, పావస్కరం తథా
ఏతన్యాహుర్మహాదేవి, మహాదానాని షోడశీ ॥

(1) గోదానం, (2) హిరణ్యదానం, (3) రజితదానం, (4) రత్నదానము, (5) సరస్వతీదానం, (6) తిలదానం, (7) కన్యా

దానం, (8) గజదానం, (9) అశ్వదానం, (10) శయ్యాదానం, (11) వస్త్రదానం, (12) భూదానం, (13) ధాన్యదానం, (14) పయస్వినీదానం, (15) ఛత్రదానం, (16) గృహదానం.

## మరియొకరీతి షోడశమహాదానములు

(1) గోదానము, (2) భూదానము, (3) తిలదానం, (4) హిరణ్యదానం, (5) రత్నదానం, (6) విద్యాదానము, (7) కన్యాదానం, (8) దాసీదానం, (9) శయ్యాదానం, (10) గృహదానం, (11) అగ్రహారదానం, (12) రథదానము, (13) గజదానం, (14) అశ్వదానము, (15) మేకపోతుదానం, (16) మహిషీదానం.

## నవవిధ ధర్మములు

(1) పుణ్యము, (2) న్యాయము, (3) సామ్యము, (4) స్వభావము, (5) ఆచారము, (6) అహింస, (7) వేదోక్తవిధి, (8) వుపనిషత్, (9) యజ్ఞము.

## అష్టాదశజాతులు

(1) బ్రహ్మ, (2) క్షత్రియ, (3) వైశ్య, (4) శూద్ర, (5) వ్యావహారిక, (6) గోరక్షక, (7) శిల్పక, (8) పంచాన, (9) కుంభకార, (10) తంతువాయి, (11) క్షౌరక, (12) రజక, (13) వస్త్రచ్ఛేదక, (14) చర్మకార, (15) తిలఘాత, (16) లుబ్ధక, (17) చండాల, (18) మాతంగ.

## స్త్రీ, పురుష జాతులు

పద్మిని, హస్తిని, శంఖిణి, చిత్రిణి అను స్త్రీజాతులున్న, భద్రుడు, దత్తుడు, కూచిమారుడు, పాంచాలుడు అను నాలుగు

పురుషజాతులున్ను చెప్పబడినవిగాని, ప్రత్యేకముగా ఆ లక్షణములు కాక, సంకరలక్షణములే గాననగును.

## అష్టాంగయోగములు

1. యమము = అహింస, సత్యము, దొంగతనముచేయకుండుట, దానం ప్రతిగ్రహించకపోవుట.
2. నియమము = బాహ్యాంతరపరిశుద్ధి, తపస్సు, సంతుష్టి, వేదాధ్యయనము, పరమేశ్వరధ్యానము.
3. ఆసనము = ప్రాణము నియమించుటకు అనుగు అవయవముల నుంచి కూర్చుండుట.
4. ప్రాణాయామము = రేచక, పూరక, కుంభకములను ఒక నియమపద్ధతిగా నడపుట.
5. ప్రత్యాహారము = యింద్రియములను విషయములవెంట పరుగిడ నీయకుండుట.
6. ధారణ = చక్రస్థానములయందు మనస్సును చలింపకుండ నిలుపుట.
7. ధ్యానము=సగుణనిర్గుణరూపములలో పరమాత్మను ధ్యానము చేయుట.
8. సమాధి = ధ్యానవిషయమునందు మనస్సు చేర్చుట సమాధి.

## జీవేశ్వరైక్యభ్రాంతి

అణువుమొదలు మహామేరుపర్యంతముగల సకలవస్తువుల బాహ్యాభ్యంతరములయందు ఆత్మ నిండియున్నది. ఈ ఆత్మ ఖండఖండములైనట్లు వస్తువులయొక్క భిన్నత్వమువలనతోచుచున్నది. ఒకేవస్తువు

యొక్క లోపల, బయటనుండే ఆత్మవస్తువుయొక్క ఆవరణముచే ఖండములుగానే లేదు. తెంపులేక అఖండముగానేయున్నది. కనుక వుపాధిగతుడై యున్న జీవునికి నిరుపాధికమైయున్న పరమాత్మకు జీవోపాధివలన ఖండత్వము స్ఫురించుచున్నదేగాని ఆత్మయొక్క అఖండ వ్యాపకత్వము భగ్నముకాలేదు. కనుక ఆత్మ భిన్నభిన్నవస్తువులయందు ఖండఖండములుగాకుండా వస్తువేలేనపుడెట్లు అఖండముగానున్నదో అట్లే వస్తువున్నపుడుగూడ అఖండముగానున్నదని గుర్తింపవలెను. ఖండఖండములుగానున్నట్లు దోచుభ్రాంతికి కల్పితనామరూపములే కారణమైయున్నవి. ఖండములే కాలేదుగనుక అఖండమొనర్చవలెనని గాని ఆ ఖండములను ఐక్యమొనరించవలెననిగాని తలంచుటయు భ్రాంతియే అయివున్నది.

ఈ భ్రాంతికి ప్రతిబింబవాదమువంటి వాదములు చాలవరకు కారణము. బింబమొకచోట ప్రతిబింబమొకచోట గానవచ్చి ఆ రెంటి మధ్య (బింబ ప్రతిబింబదృష్టాంతములో) యెడము, ఖాళీలేక అవకాశము గానవచ్చుటచే ఆ రెంటినీ ఐక్యమొనర్చవలననే భ్రాంతి యుదయించినది. జీవునకు ప్రతిబింబమున్ను ఈశ్వరునకు (బ్రహ్మమునకు) నిజబింబము తోను దృష్టాంతం చెప్పబడినది. కనుక జీవేశ్వరైక్యం, లేక ప్రత్యగ్బ హ్మైక్యము సాధించవలెననే భ్రాంతికి కారణమైనది. అద్దము, నీరు మొదలగునవి యున్నపుడే ప్రతిబింబమునకు యునికియున్నది. అట్లే వుపాధియున్నపుడే జీవేశ్వరులకునికియున్నది. జీవుడు అవిద్యోపాధియని ఈశ్వరుడు మాయోపాధియని చెప్పబడుచున్నారు. అవిద్యా, మాయా వుపాధులు మిథ్యాస్వరూపములని చెప్పబడుచునేయుండగా రెండు ప్రతిబింబముల నొకదానితో నొకదానికిగాను లేక అధిష్ఠానచేతనముతో ఆ రెంటికిగాని ఐక్యముచెప్పుట హాస్యాస్పదమే అగుచున్నది. అద్దము బ్రద్దలైనా, నీరులేకపోయినా ప్రతిబింబములే లేకుండాపోవుచున్నవి. ఏమైనవి? నిజబింబమువద్దకేగి దానితో నైక్యమైనవా? ప్రతిబింబ మే

స్థానమునదోచినదో ఆ స్థానమందే లేకపోయినదిగాని నిజబింబంతో ఐక్యము పొందలేదనుట స్పష్టము.

ఆత్మ సర్వవ్యాపకమని అంగీకరిస్తే ఐక్యముచెప్పరాదు. ఏలననగా ఐక్యతచెపితే ఆత్మకు ఏకదేశీయత చెప్పవలసివుండును. జీవేశ్వరుల వుపాధులైన అవిద్యామాయలయందు ప్రతిఫలించిన అధిష్ఠానచైతన్యము ఏకమయ్యేవున్నది. కనుక ఐక్యపరచుటయనేది భ్రాంతి. కనుక జీవేశ్వరైక్యములేక ప్రత్యగ్బ్రహ్మైక్యము అనుట భ్రాంతి జన్యవాదములు. ఇట్టి భ్రాంతులవలన సర్వభ్రాంతిరహితము లేక జననమరణభ్రాంతి రహితము కాజాలునా ?

పరాయెరుక (అఖండయెరుక), కేవలయెరుక (శుద్ధయెరుక), మిశ్రమయెరుక మలినయెరుక అని బోధ దృఢీకరణార్థము యెరుక నాలుగు విధములుగా విభజింపబడినది. అందు మిశ్రమయెరుకయే జీవత్వము. కేవలయెరుకలేక శుద్ధయెరుకయే ఈశ్వరత్వము. నేను జీవుడనుగాను. నేను శుద్ధమైన ప్రత్యగాత్మస్వరూపుడను, సృష్టికి పూర్వమున్న పరమాత్మతో నే నైక్యముచెందవలెను అనే కోరికతో కొందరు జ్ఞానమార్గములో కృషిచేయుచున్నారు. ఏలననగా తనయందలి ప్రత్యగాత్మ వేరని, ప్రతిప్రాణియందునూ ప్రత్యగాత్మవేరుగానున్నదనీ, తనయందలి ప్రత్యగాత్మకు పరమాత్మతో ఐక్యపరచుటయే తనకు మోక్షమనీ కొందరు భ్రాంతిజెందియున్నారు.

అట్టి ఐక్యత సాధించుటకై మహావాక్య విచారణయో లేక అహంగ్రహోపాసనయో సాధనముగా యెంచి కృషిచేయుచున్నారు.

*అహంగ్రహోపాసన:*— (1) ఆత్మపాదచతుష్టయము అనగా జీవతను చతుష్టయమగు విశ్వ, తైజస, ప్రాజ్ఞ, ప్రత్యగాత్మలు, (2) బ్రహ్మపాద చతుష్టయమనగా, విరాట్ హిరణ్యగర్భ, అవ్యాకృత, పరమాత్మలు, (3) ప్రణవపాద చతుష్టయమనగా, అకార, ఉకార,

మకార, అర్ధమాత్రకలు. యీ త్రివిధములైన చతుష్టయములలో, మొదటిపాదములగు విశ్వ, విరాట్, అకారములకు ముందుగా ఏకత్వ మును ధ్యానరూపంలోసాధించి, పిదప రెండవపాదములు, అనగా తైజస, హిరణ్యాగర్భ, ఉకారములకళ్లే ఐక్యతసాధించవలెను. పిదప మూడవపాదములగు, ప్రాజ్ఞ, అవ్యాకృతమకారములకైక్యత నూహించ వలెను. ఈ రీతిగాచేసినచో చివరకు ప్రత్యగాత్మా, పరమాత్మా, అర్ధ మాత్రకలకు ఏకత్వమును సాధించనగును. దీనికి అహంగ్రహోపాసన యని పేరు.

# నేనేబ్రహ్మనేభ్రాంతి (మహావాక్య చతుష్టయము)

జీవేశ్వరజగత్తులను తత్వత్రయములో జగత్తును మిథ్యారూపంగా (అనగా పారమార్థికంగా అసత్యమని) త్రోసివేయగా మిగిలిన జీవ యీశ్వరులను లేక జీవబ్రహ్మలకు ఏకత్వమును ప్రతిపాదించి చెప్పు వుపనిషద్వాక్యములకు మహావాక్యములని పేరు. ఒక్కజీవుని గురించియో, లేక ఒక్క బ్రహ్మమునుగూర్చియో మాత్రమే చెప్పు వాక్యముల కవాంతరవాక్యములని పేరు.

(1) ఋగ్వేదాంతర్గతమగు ఐతరేయోపనిషత్‌నందలి "ప్రజ్ఞానం బ్రహ్మ" (2) యజుర్వేదాంతర్గతమగు బృహదారణ్యకోపనిషత్‌నందలి "అహంబ్రహ్మాస్మి" (3) సామవేదాంతర్గతమగు ఛాందోగ్యోపనిషత్ నందలి "తత్వమసి" (4) అధర్వణవేదాంతర్గతమగు మాండూక్యోపనిషత్ యందలి "అయమాత్మబ్రహ్మ" అను నాలుగు వాక్యములే మహా వాక్యములని పిలువబడుచున్నవి. యీ నాల్గింటిలో "అయమాత్మా బ్రహ్మ" అనగా "యీ ఆత్మయే బ్రహ్మము" అని నిష్కర్ష చేసి తెలియచేయుచున్నందున దీనికి సాక్షాత్కారవాక్యమని పేరు. ఆత్మ యొక్కయు బ్రహ్మముయొక్కయు వస్తునిశ్చయజ్ఞానము కల్గినపుడే యిట్టి సాక్షాత్కారము సాధ్యమని గుర్తెరుగవలయును.

# వార్త్తికనిర్ణయము

"ప్రజ్ఞానబ్రహ్మ" ఆదిగాగల మహావాక్యముల పదపదార్థములను అన్వయవ్యతిరేక యుక్తులచే విమర్శించగా జ్ఞానమే ఆత్మ అదియే బ్రహ్మము అని తెలియబడినది. కాని జ్ఞానముకూడ యొక యుపకరణమే. సాధనములేక పనిముట్టుమాత్రమే అయివున్నది. అట్టి జ్ఞానముచే తెలియబడు జ్ఞేయమే బ్రహ్మముగాని జ్ఞానము బ్రహ్మముకాదని వార్త్తిక నిర్ణయము. నిజమునకు జ్ఞానజ్ఞేయములు రెండూ ఒకటే. యివి పరస్పర సాపేక్షికములై ఒకదానియునికికి రెండవది ఆధారమైవున్నవి. కనుక విచారించిచూస్తే రెండూ ఒకటే. స్వప్నావస్థయందు మనస్సే మనస్సుచేతనే మనస్సునే నానాదృశ్యరూపములుగా చూచుచున్నట్లే జ్ఞానము జ్ఞానముచేతనే జ్ఞానమునే గుర్తెరుగుచున్నది. కనుక జ్ఞేయము అనగా గుర్తెరుగబడినదిన్ని జ్ఞానమే. ఈ త్రిపుటులయందు ఒకటుంటే మిగతా రెండున్నువుండును. ఏది లేకున్నా మిగతావి ఆ క్షణంలో లేవన్నమాటే. కనుక యివి సాపేక్షికసత్యములు. జ్ఞేయముసత్యమై జ్ఞానము అసత్యముకాబోదు. కాని వార్త్తికపద్ధతియందు జ్ఞేయము మాత్రము సత్యమని, దానిని జ్ఞానముచేగుర్తించి ఆ జ్ఞానమును వదలి వేయవలసివున్నదనీ (జ్ఞానేన జ్ఞేయమాలోక్య పశ్చాద్జ్ఞానం పరిత్యజేత్) అని చెప్పబడినది. కనుక యీ వార్త్తికసిద్ధాంతపద్ధతియు భ్రాంతి రూపమే అయివున్నది.

కనుక "సోఽకామయత బహుస్యాం ప్రజాయేయ" అని తొలి సంకల్పంచేసిన యీ సంకల్పపురుషుడే ఉపాదాన, నిమిత్తకారణములు రెండూ తానేఅయి తానే ఈశ్వరజీవజగద్రూపములుగానుండి జీవోపాధుల యందు తానే జీవరూపంగా "అనేన జీవేనానుప్రవిశ్య" అని చెప్పబడిన రీతిగా ప్రవేశించి, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములతో కర్మయొనర్చి ఆ కర్మఫలములు అనగా ఐశ్వర్య, సంతాన కీర్తి ప్రతిష్ఠ సుఖదుఃఖాదులను పొందుచూ అణిమాది అష్టసిద్ధులు, సాలోక్య సామీప్య సారూప్య

సాయుజ్యాది ముక్తులు, నైష్కర్మ్యసిద్ధి, జీవేశ్వరైక్యము, లేక ప్రత్యగ్బ్రహ్మైక్యరూప మోక్షము యిత్యాదులయందు భ్రాంతిగల్గి యుండుటయంతయు వున్మత్తునిధోరణిగా నున్నది. ఇట్టి పద్ధతులయందు భ్రాంతిగల్గి గ్రుడ్డిగానమ్మి వ్యవహరించుట పరతంత్రరూపమగు అనుకరణయేయగును కాని స్వచ్ఛందుల స్వతంత్రపద్ధతిగాదు.

సర్వులు పరమాత్మస్వరూపులై యున్నను, మతకర్తలు నిర్ణయించిన ఏదోమతముననుసరించి ఆ మతహద్దులలోబద్ధులై భ్రాంతిపరులగుచున్నారు. మోక్షసాధనములుగా మతకర్తలు నిర్ణయించిన కర్మ భక్తి జ్ఞానవైరాగ్యతత్వ సాధనామార్గములయందు కృషిచేయుచు వాని వలననే జన్మరాహిత్యముపొందగలమని ఆసించుచున్నారు.

# సాధనారూపమైనభ్రాంతి
# కర్మభక్తి జ్ఞానవైరాగ్యతత్వ ముముక్షత్వములు

వస్తుతఃసర్వము పరమాత్మయే. తానూ పరమాత్మయేయైనను మానవుని అంతఃకరణము త్రిగుణరూపమగు ప్రకృతివలన ఆవరింపబడి స్వరూపమును మరచి భ్రాంతిపరుడై యుంటున్నాడు. అట్టిమానవుని తరుణోపాయమునకై మతకర్తలు సాధనరూపముగా కర్మభక్తి జ్ఞాన వైరాగ్యతత్వముముక్షుత్వములను సోపానక్రమముగా నిర్ణయించినారు. ఇందొక్కదానివలననే జన్మరహితరూపమగు మోక్షము సిద్ధింపగలదని భ్రాంతిచెంది తమ ప్రవృత్తిననుసరించి అందేదోనొకదానిని ఆశ్రయించు చున్నారు. కాని అది సరిఅయిన పద్ధతిగాదు. ముందుముందుగా యీ పద్ధతులవివరము నెరుంగవలసివున్నది.

## కర్మ

కర్మ అనగా చేయునట్టిపని. పనులెట్లు జరుగుచున్నవనగా, జ్ఞానేంద్రియములద్వారా విషయపంచకమును తెలుసుకొన్నవాడై

మానవుడు కర్మేంద్రియములచే కర్మయొనర్చుచున్నాడు. కనుక జ్ఞానేంద్రియముల, ద్వారా శబ్దాది విషయపంచకమును గుర్తించి జ్ఞాన మనోబుద్ధి చిత్తాహంకారరూపములతో పనిచేయునది జ్ఞానమే. కనుక కర్మ ప్రవృత్తికి జ్ఞానము మూలకారణముగానున్నది. ఆ జ్ఞానము విషయమునుగుర్తించి తెలుసుకొని మనస్సుతో సంకల్పించి బుద్ధిచే నిశ్చయించి చిత్తముచే కర్మచేయువిధానము చింతించి, కర్తృత్వాహం కారముతో కర్మచేయును. ఇట్టి అంతరేంద్రియ వ్యాపారమునకు వ్యష్టి సమష్టి అంతఃకరణములు కారణము. కనుక పరమేశ్వరుని సనుష్ట్యంతః కరణమందలి ప్రథమసంకల్పమే అత్యంత మూలకారణములుగానున్నది. ఆ సంకల్పము జ్ఞానము లేక మనస్సుయొక్క కర్మ (పని), కనుక ఆ సంకల్పము జ్ఞానము కారణముగాగల్గి కార్యరూపమైన కర్మకు కారణ మైనది. కనుక యిదియే జ్ఞానకర్మలముడి.

కర్మజరుగవలెనన్న చలనముండవలెను. కనుక ఆ సంకల్ప పురుషుని కర్మయున్ను ప్రాణములేక జరుగదు. కనుక జ్ఞానప్రాణము లనే రెండు లక్షణములున్ను ఆతనికి సహజములై యున్నవి. ఆతడే అయిన యీ సృష్టిలో యీ జ్ఞానప్రాణములు వుపాధిననుసరించి వేర్వే రుగా నుండి పనిచేయుచుండును. స్థావరములగు వృక్షాదులు ప్రాణ వాయువును విడచుచుండగా జంగమజీవు లాప్రాణవాయువును గ్రహించి బొగ్గుపులుసుగాలిని విసర్జించును. వృక్షాదు లా బొగ్గుపులుసుగాలిని ఆస్వాదించి వికాసముచెందుచున్నవి. జంగమజీవులుద్భవించినదాది మరణించువరకు అహోరాత్రములు యీ ప్రాణము వుచ్ఛ్వాసనిశ్వాస రూపంగా లోనికి బైటికి సంచరించుచుండును. అందువల్ల జఠరాగ్ని ప్రజ్వరిల్లి ఆకలిదప్పులుగల్గి ఆహారపానీయములు స్వీకరించును. అవి సప్తధాతురూపంచెంది పోషించుచుండగా దేహము బాల్యయవ్వన కౌమార వార్ధక్యమరణములు చెందుచున్నది.

ఆదియందున్న ప్రథమసంకల్పమునకు పరమాత్మయొక్క పరం

జ్యోతిస్వరూపమగు స్వప్రకాశమే మూలకారణము. ఆ పరంజ్యోతి నుండియే అనేక జ్యోతులు వెలువడినవి. భూతజ్యోతులనదగు సూర్య చంద్రనవగ్రహ నక్షత్రాదులయొక్కయు విద్యుత్‌యొక్కయు ప్రకాశములకున్న వుపాధులయందు ఆపోజ్యోతిరూపంగానున్న వ్యాప్తి ప్రకాశమున్ను "దీపోదీపాంతరం యధా" అనునట్లు ఆ పరంజ్యోతినుండియే వెలువడినవి. ఇట్లు వెలువడుటవల్ల ప్రధమజ్యోతి ప్రకాశము క్షీణించదు. ఎట్టి తరుగున్ను పొందకపోవుటవల్ల అవ్యయమనబడుచున్నది. ప్రమిదలు, చమురు, వత్తులు వేరువేరుగా నుండవచ్చును. ప్రకాశమునందున్న హెచ్చుతగ్గు తారతమ్యములుండవచ్చును. కాని ప్రకాశమంతయు ఆపరం జ్యోతిదే. ఐనను వుపాధులయందున్న ఆ ప్రకాశమునకు ప్రత్యగాత్మ ప్రకాశమనే వ్యవహారము కల్పితమైనది.

ఎప్పటికప్పుడు నిత్య నూతనసృష్టి జరుగుచున్నట్లు గానవచ్చినను మూలపదార్థము మాత్రమొక్కటే. యీ సృష్టికార్యమునకంతకూ ఆ పరమాత్మయొక్క సంకల్పరూపకర్మయే కారణము. కనుకనే, కం॥ కర్మమునబుట్టు జంతువు, కర్మమునను వృద్ధిబొందు కర్మమునజెడున్, కర్మమె జనులకుదైవము, కర్మము సుఖదుఃఖములకు కారణామధిపా॥ అని చెప్పబడినది. శరీరమున ప్రాణవాయు సంచారమున్నంతవరకు ఆకలిదప్పి నిద్రామరణంబులు తప్పవు. కనుక కర్మనుత్యజించుటయెవరివశమున్నుగాదు. కర్మత్యాగము అసంభవము. కనుక సన్యాసాశ్రమస్వీకారము కర్మరహితమునకు మార్గముకాజాలదు. గృహస్థాశ్రమమందుండియే నైష్కర్మ్యసిద్ధి పొందవలసివున్నది.

సంకల్పించు జ్ఞానమున్నంతవరకు దాని చలనరూపమగు ప్రాణమున్ను దాని కార్యరూపమగు కర్మయున్నూ వుండకతప్పదు. కనుక కర్మరాహిత్యమున్ను తద్వారా జన్మరాహిత్యమున్నూ సిద్ధించవలెనంటె పరిపూర్ణబోధచే జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ త్రిపుటీరహితము గావించుకొనుటయే కర్తవ్యము.

# గృహస్థాశ్రమ నిర్ణయము

ధర్మ అర్థకామమోక్షములను చతుర్విధ పురుషార్థములలో, ధర్మ, అర్థకామములు మూడున్నూ భార్యవల్లనే భర్తకు ప్రాప్తించ వలయును, యితరపద్ధతుల వేనివల్లను అవి ప్రాప్తించవు. శ్లో॥ కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ అను శ్లోకమున చెప్పబడినట్లు ధర్మపత్నికి ఆరు లక్షణములు చెప్పబడినవి. (1) కార్యాచరణమునందు దాసివలె, (2) ఆలోచనమునందు మంత్రివలె సలహాచెప్పుట, (3) భర్త సుఖదుఃఖము లందు భూమివలె నోర్పుగల్గి సహించుట, (4) భోజనముపెట్టుటయందు తల్లివలె నాదరించి ప్రేమతోపెట్టుట, (5) భర్తను రంభవలె ఆనంద పరచుట, (6) రూపమునందు మంగళప్రదమైన వేషముధరించి లక్ష్మివలె నుండుట. ఈ ఆరు లక్షణములున్న భార్యవలన భర్తకు ధర్మప్రవర్తన, న్యాయపద్ధతిగా ద్రవ్యప్రాప్తియు గల్గును. మరియును కేవల సత్సంతాన ప్రాప్తికేగాని కామప్రవృత్తి పూనడు. ఈ విధముగా మొదటి మూడు పురుషార్థములు లభించుటయేగాక, పరిపూర్ణగురువు నాశ్రయించి సత్కర్మానుష్ఠానం ద్వారా అంతఃకరణసిద్ధియు జ్ఞానోదయమున్ను గాంచి తుదకు జననమరణ భ్రాంతిరహితమును అవలీలగా పొందగలరు. కనుక యిందుకు గృహస్థాశ్రమమే మిక్కిలి శ్రేష్ఠమైనది. ఐతే బ్రహ్మ చర్య గ్రహస్థ వానప్రస్థ సన్యాసాశ్రమములను శాస్త్రమేల నిర్ణ యించినదంటె, మిగతా మూడు ఆశ్రమధర్మములు కూడా గృహస్థాశ్ర మమునందు అంతర్భూతములేగాని వేరుగావు. ఎట్లనగా,

1. బ్రహ్మచర్యము అనగా సర్వేంద్రియ వ్యవహారములు అధి దైవిక పద్ధతిగాక బ్రహ్మనిర్ణయపద్ధతిగా (అనగా పరమాత్మ నిర్ణయపద్ధతిగా) కర్తృత్వరహిత విధానముతెలిసి కర్మ యొనర్చుట. భార్య లేనివానికి పూర్ణమగు కర్మాధికారమే లేదు. కనుక భార్యతోకూడి సకలకర్మలు కర్తృత్వత్యాగ ముతో జరుపుట గృహస్థునికే సాధ్యము. బ్రహ్మమునందే

మనస్సుంచి సంసారముచేసినవాడు సంతానవంతుడై యున్నా సదా బ్రహ్మచారి అని కీర్తింపదగియుండును.

2. వానప్రస్తమనగా, సంతానప్రాప్తికల్గిన అనంతరం భార్యతో నివసించుచున్ననూ ఆమెను మాతృవతుగా చూచుకొనుచూ పోషించుట. గృహస్తాశ్రమమునందు ఋతుకాలమునందుగాక యితరకాలమునందు నిగ్రహముగల్గియుండి దొరికినదానితో దేహపోషణచేసికొనుచూ నుండినచో గృహమందున్నా వనమందున్నా నొక్కటే. అట్లుండుటయే గృహస్తాశ్రమాంత గ్గతమగు వానప్రస్తము.

3. సర్వసంగమును విడనాడుట సన్యాసము. అంతఃకరణయందెట్టి సంగము లేకుండావున్నచో బాహ్యవేష భాషాడంబరములు లేక యుండినను బాధ లేదు. అట్టి అంతరంగ సన్యాసము కల్గి యున్నపుడు గృహస్తుగానుండియు, సన్యసించినట్లే కాగలదు.

కనుక యీ మూడు ఆశ్రమధర్మములు కూడా గృహస్తు పూని యుండవచ్చును. ఆశ్రమము మార్చివేయనక్కరలేదు. క్రమశః సోపాన క్రమముగా ఆ యా ధర్మములను పాటించినచో గృహస్తు కృతకృత్యుడు కాగలడు. తాను తరించి యితరులకు తరింపచేయు గురువై లోకసేవ చేయుటకున్నూ గృహస్తాశ్రమమే యుత్తమమైనది. అతిథి అభ్యాగతు లకు ఆశ్రయమిచ్చుచు మిగతా ప్రాణికోటికి మేలు చేకూర్చుచునుండు గృహస్తే బ్రహ్మచర్య సన్యాసాశ్రమములందున్నవారికి సహితం ఆధారమైయున్నాడు. భార్యా పుత్రాదులతోకూడిన సంసారమెంతయో దుఃఖప్రదముగానున్నను సమత్వయోగమభ్యసించుటకు గృహస్తాశ్ర మమే పాఠశాలవంటిది. సోమరితనమునకు యెంతమాత్రము తావీయక కర్మయోగియై సుఖదుఃఖాది ద్వంద్వముల అనుభూతియందు అంతః కరణ స్థిమితము గోల్పోక అన్ని గృహస్తాశ్రమధర్మముల నిర్వహించు చున్నను, సదాబ్రహ్మచారియై, సదోపవాసియై కర్మకౌశలమెరిగి వర్తించుగృహస్తే ధన్యజీవి.

# భక్తి నిర్ణయము

(1) ఆర్తభక్తి, (2) జిజ్ఞాసుభక్తి, (3) అర్థార్థిభక్తి, (4) జ్ఞాని భక్తియని భక్తి నాలుగువిధములు.

1. ఆర్తభక్తి:— ఆర్తుడనగా దుఃఖాక్రాంతచిత్తము గలవాడు. ఆర్తియనగా బాధ. కష్టములోనున్నపుడు భగవంతుని స్తోత్రముచేయుట, తన్నివారణకై మ్రొక్కులుమ్రొక్కుట, ఆ మ్రొక్కులుఫలించినపుడు అవి తీర్చుట యిట్టివన్నియు ఆర్తభక్తితరగతిలోనికి వచ్చును. ఆపదమ్రొక్కులు సంపద మరపులు అన్నసామ్యముగా ఆ కష్టముగట్టెక్కుటతోనే ఆ భక్తినశించును.

2. జిజ్ఞాసుభక్తి:— అనగా భగవంతునివిషయమై శాస్త్రమేది చెప్పినదో యెరుగగోరువాడు జిజ్ఞాసి. జ్ఞానాభిలాషయేగాని యితనికి ముముక్షుత్వము లేదు. కనుక జ్ఞానమార్జించుటకు మాత్రమే శాస్త్రమునందును గురువునందును భక్తినిలుపును. కాని ఆచరణమేమియునుండదు. భగవంతునిగురించి చక్కని యుపన్యాసములుమాత్ర మీయగలడు. కనుక ధనకీర్తి ప్రతిష్ఠ లకే ఆతనిజ్ఞానము కైంకర్యమగునుగాని జన్మరహిత విధాన మందు వీసమంతయు కొరకాదు. ఈతడు బోధకుడు కాగలడు కాని సాధకుడు గాజాలడు. కనుక బాధ గురువుగా మాత్రమే వుండి శిష్యవిత్తాపహారణయేగాని చిత్తాపహారికాజాలడు. కనుక జిజ్ఞాసుభక్తిపారమార్థికముగా తనకుగాని యితరులకుగాని వుపయోగపడదు.

3. అర్థార్థిభక్తి:— ఒకానొక అర్థమును, లేక వస్తువును లేక సిద్ధు లను ప్రాప్తింపచేసుకొనుటకై చేయు వుపాసనాదికమంతయు యీ తరగతి భక్తిలోనికివచ్చును. ఇది శుద్ధకామ్యభక్తి. ఆ

కోరిక సిద్ధించుటతోనే యీ భక్తి అంతరించును. లేదా యితర కామ్యసంసిద్ధికి దారితీయుచుండును.

4. *జ్ఞానియొక్క భక్తి:*— వాచాజ్ఞానముతో తృప్తిపడక, గురూపదిష్టమార్గమందు కృషిచేసి గురుకృపచే లేక యిష్టదైవకృపచేత అనుభవజ్ఞానముకల్గి మోక్షము పొందవలెనని చేయుభక్తియే జ్ఞానియొక్క భక్తి.

జ్ఞానియొక్క భక్తి బాహ్యాభక్తి, అనన్యాభక్తి, ఏకాంతభక్తి అని సోపాన క్రమముగా వుత్తరోత్రా వుత్తమమైయున్నది.

*బాహ్యాభక్తి:*— శ్లో॥ శ్రవణం, కీర్తనం, స్మరణం విష్ణోఃపాద సేవనం। అర్చనం, వందనం, దాస్యం, సఖ్య, మాత్మనివేదనం॥ అనినవవిధములు. ఈ భక్తియందు భగవంతుడు, భక్తుడు, భక్తిసాధన అను త్రిపుటి లక్షణము గలదు. మరియు యీభక్తి దశయందు తనయిష్టదైవమునందే భక్తి నిలుపును. యితర దైవములయందు విరక్తిగల్గియుండును.

*అనన్యాభక్తి:*— ఈ భక్తిదశయందు సర్వమూ తనయిష్టదైవస్వరూపమే. తనయిష్టదైవము కానిది కొంచమైనాలేదు. నామరూపకమైన చరాచరమంతయూ తనయిష్టదైవము యొక్క మారురూపమే కనుక దీనికి అనన్యాభక్తి యని పేరువచ్చినది. కాని వుపాసకుడైన తాను వేరు. వుపావాస్యమైన యిష్టదైవమువేరు అను భేదభావము యింకనూ పోలేదు కనుక యిందు ద్విపుటి వున్నది.

*ఏకాంతభక్తి:*— ఈ భక్తిసోపానమునందు తన యిష్టదైవము మినహా మరేమీలేదు. తానైనను లేదు ఏలననగా తానుకూడా యిష్టదైవమే. అంతయు అఖండాత్మయేగాని యిష్టదైవమంటూ లేనేలేదు. ఏకమేవాఽద్వితీయంబ్రహ్మ", "సర్వంఖల్విదంబ్రహ్మ" అనే అఖండజ్ఞానమున్ను ఏకాంతభక్తిన్ని యిచట ఒకటేఅయివున్నవి. రెంటియొక్క

కలయిక స్థానము యిదియే. ఇట్టి అఖండాత్మదృష్టిగల్గి త్రికరణ శుద్ధిగా ప్రవర్తించినవాడు తప్పక కృతకృత్యుడగును. త్రికరణ శుద్ధిలేనివాడు సర్వమువృథాయే. త్రికరణముల శుద్ధప్రవర్తనయే ఆత్మకాహారము.

# సప్తాన్నముల నిర్ణయము

(1) పశువులకు తృణాదులే యన్నము. (2) మానవులకు ధాన్యాదులు ఫలాదులు ఆహారము. (3) పితృదేవతలకు శ్రాద్ధాతర్పణాదులే అన్నము. (4) దేవతలకు హవిర్భాగములున్ను క్షుద్రదేవతలకు భూతప్రేత పిశాచాదులకు బలులే అన్నము. (5), 6, 7 — మనస్సు, వాక్కు, శరీరమ్ములు ఆత్మకు అన్నస్వరూపమైయున్నవి. యివియే త్రికరణములు. వీనిసంయమనమే త్రివిధరూపమగు కాయిక, వాచిక మానసిక తపస్సులు. ఇట్టి తపస్సుల వలన అంతఃకరణము పరిశుద్ధమై ఆత్మతేజోవంతముగా ప్రకాశించును. కనుక త్రికరణ శుద్ధితో కూడిన కర్మాచరణమే ఆత్మకు అన్నముగా చెప్పబడుచున్నది.

పరమాత్మకంటే తాను భిన్నముగాలేను. తానే పరమాత్మ. పరమాత్మయేతాను. తనయందే సర్వము తోచబడుచున్నది. సర్వమునందు తానే యున్నాడు యిట్టి అఖండాత్మ దృష్టియే జ్ఞానము. ఇట్టి జ్ఞానము కల్గిన వ్యక్తుని పూర్ణముగా ప్రేమమయుడై సర్వమును బ్రహ్మస్వరూపముగా నుపాసించును. "స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యభిధీయతే" అనగా స్వస్వరూపమును ధ్యానించుటయే భక్తియన్నారు. అనగా తన నిజస్వరూపము లేక తొలిరూపము ఆత్మయే అని తెలిసినచో దేహాత్మబుద్ధివీడి యుండును సర్వవ్యాపకమగు ఆత్మయే తన స్వరూపమేతాను అని అను సంధానము చేయుటయే భక్తి అన్నారు. భక్తి యనగా కలసియుండుట. విభక్తి అనగా విడిగానుండుట. ఆత్మతో కలసి ఏకత్వముగా నుండుటయే భక్తి ఇదియే జ్ఞానియొక్క భక్తి, ఇట్టి భక్తిగల జ్ఞానులే పరిపూర్ణబోధ పొందుటకు పూర్ణాధికారులు.

# జ్ఞాననిర్ణయము

జ్ఞానమనగా తెలివి అనియు మరియు మోక్ష విషయిక బుద్ధి యనియు సామాన్యార్థము శాస్త్రవిషయ పరిజ్ఞానము మాత్రము జ్ఞానమునకు అర్థముగా గ్రహింపరాదు. తానెవరో తెలుసుకొన్న తెలివియే జ్ఞానము. పరమాత్మ తన తెలివిచే సంకల్పించి తానే అయు పాధులుగా పరిణమించి, తానే వానియందు తెలివి రూపంగా పునః ప్రవేశము గావించినాడు. ఈ తెలివి ముఖ్యముగా మానవోపాధియందు సంపూర్ణముగా ప్రకాశించుచున్నది. జ్ఞానేంద్రియములచే శబ్దస్పర్శరూప రసగంధ విషయములను తెలుసుకొని కర్మేంద్రియములచే కర్మయొనర్చు చున్నాడు. కనుకనే జ్ఞానము, నేను, అనిన యొక్కటే. జ్ఞానముచే గుర్తించి చేయునట్టి కర్మ వేరని జ్ఞానము వేరని అనరాదు.

పిండాండము నందలి ప్రత్యగాత్మ, పరమాత్మయేగాని వేరుగాదని గురుమూర్తివల్ల తెలసుకొని విషయ వాసనలు విడచిన యెడల తానే పరమాత్మయనే అఖండస్థితి యందుండును. ఇక విషయ వాసన లాతని పరమాత్మ పద్ధతినుండి దిగజార్చలేవు. పెరుగును చిలికి వెన్నతీసిన తర్వాత యెంత ప్రయత్నం చేసినా ఆ వెన్న తిరిగి ఆ మజ్జిగయందు కలువదు. అని గుర్తించిన జ్ఞానులు కర్మఫలమ్ముల నాసించరు.

# వైరాగ్య నిర్ణయము

వైరాగ్యమనగా విషయేచ్ఛారాహిత్యము. పరమాత్మరూపు డైన తాను ఆప్తకాముడు. అన్నియు తన స్వరూపములే అయి తన యందే వునికి గల్గియున్నవి. చందన వృక్షము యితర సుగంధముల నపేక్షింపక తన సుగంధమునందే తాను వుండును. తాను వుండగా తన సుగంధముపోదు. అగ్నిచే దహింపబడి తానేలేకుండా పోయినపుడే తన సుగంధము తనతోగూడ పోవును. అట్లే అన్ని విషయములకు పుట్టినిల్లైన తాను వుండాలి, విషయ వాసనలు పోవాలి, అన్నచో అవి పోజాలవు.

విషయములకు ఆశ్రయముతాను. విషయేచ్ఛతనకే గల్గుచున్నది. కనుక తన అహమున్నంతవరకు విషయేచ్ఛారాహిత్యముకాదు. కనుక అహం పదార్ధరహితము చేతనే విషయేచ్ఛారహితం కాగలదు. ఈ విషయం గ్రహించి పూర్ణాధికారియై గురుమూర్తివలన అచలపరిపూర్ణ పరబయలు తెలుసుకొన్న మీదట తానాచరించు కర్మయున్ను వాని ననుసరించు విషయ వాసనలున్ను సహజముగానే నశించును. బంధకారణమగు నెట్టి పుణ్యాపాపముల నీయజాలవు. అట్టి ఆరూఢస్థితి గల్గినవాడు పరిపరి విధముల పరుగులు పెట్టడు. మరివైరాగ్యముచేత మానుకొని వుండ కుండా సమరసబుద్ధితో సహజపద్ధతిగా కర్మలొనర్చును. తనయందే తాను విరక్తిచేసుకొన్నవానికి యిక విషయవాసనలేమిన్ని వుండజాలవు. కనుక పరిపూర్ణబోధవలన అహంపదార్ధరాహిత్యము చేసుకొన్నవాడే నిజమైన వైరాగ్యపరుడు.

## తత్వనిర్ణయము

పరమాత్మయే అన్ని తత్వములకు ఆదితత్వము. ఆ ఒక్క తత్వమే యిరువదిఅయిదు తత్వములుగా, ముప్పదియారు తత్వములుగా, తొంబది యారు తత్వములుగా విభజింపబడినది. ఆ పరమాత్మ తత్వమే అష్ట ప్రకృతులు, షోడశవికారములు, పురుషుడుగా నున్నది.

**అష్టప్రకృతులు:—** అవ్యక్తము, బుద్ధి, అహంకారము, పంచ తన్మాత్రలు షోడశవికారములు శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వా, ఘ్రాణము, వాక్కుపాణి పాదము గుహ్యాము గుదము, మనస్సు, పృథ్విజల అగ్నివాయు రాకాశము = మొత్తము 16.

***పురుషుడు:—*** పరమాత్మ, ఆకాశాదికము, కూటస్థుడు, సాక్షి, సంకల్ప పురుషుడు,పరాయెరుకయని ఆపురుషునికి భిన్న భిన్న నామములు.

ఈపై వివరించిన అన్నిటియొక్క యేకైక రూపమగు ప్రత్యక్షు పూర్ణమును తెలియడమే తత్వనిర్ణయము. ప్రత్యక్షు పూర్ణమగు యీ

వస్తుతత్వమే పంచవింశతి తత్వపరిపూర్ణుడనీ, పరమాత్మయనీ, యేకైక ద్వంద్వరూపుడనీ, క్షరాక్షరులు, శక్తిద్వయము, సత్తుచిత్తులు, పురుష ప్రకృతులు, క్షేత్రక్షేత్రజ్ఞులు కారణకార్యములు, యెరుకమరుపులు, జ్ఞానాజ్ఞానములు, సగుణనిర్గుణములు పాపపుణ్యములు, మానావమానములు, అను సర్వద్వంద్వములుగా నుండును. మరియు అదియే చైతన్యమని, జ్ఞానమని, అహంకారమనీ, స్వస్వరూపమనీ, ఆనందమనీ, పరమపదమనీ, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులనీ, ఆదిశక్తియనీ, వైకుంఠ సత్యలోక కైలాసాదిలోకములనీ నానా, నామరూపాత్మకమగునవి అన్నియు యీ ప్రత్యక్షపూర్ణమునందే కలవు. కనుక యిది మితిగలిగిన ఆవరణమే గాని, నిరావరణరూపము కాదు. దీనిని విచారించి తెలుసుకొనడమే తత్వనిర్ణయము.

పిండాండమందు యిరువదైదు యింద్రియములు జీవుడుప్రాణము ప్రత్యగాత్మలుగానూ జ్ఞానక్రియాశక్తులుగానూ నున్నదంతయు గూడ ఆ పరమాత్మ తత్వపరిణామమే.

## ముముక్షత్వ నిర్ణయము

ముముక్షుత్వమనగా విడచునట్టి అభీష్టములేక కోరిక, దేనిని విడువవలెనో, ముందుగా తెలియవలెను. ఏదివిడిచిన యింకేమీపట్టదో, ఏది విడచిన జన్మకర్మల భ్రాంతితొలగునో అదియే సర్వకారణము లేక మూలకారణము. అదియే జన్మకారణము భ్రాంతికారణము. అదియే బంధకారణము. ఆ బంధము సత్యమనే నిర్ణయముచేసుకొని దానిని విడచుటయే మోక్షమని అట్టిమోక్షము తనకు కావలెనని కోరుకొనుటయే మోక్షము. ఆమోక్షాపేక్ష తీవ్రముగా నున్నయెడల అది ముముక్షుత్వమనబడును. అసలీబంధ మోక్షముల భ్రాంతియేల కలుగవలెను ? అంటే— "జన్మదుఃఖం జరాదుఃఖం, జాయాదుఃఖం పునఃపునః సంసారసాగరం దుఃఖం" అని చెప్పబడినది. కనుక జననమరణరూప సంసార ప్రవాహము

దుఃఖభూయిష్టమైవుండి ప్రతిజన్మయందునూ దుఃఖపరంపరలు కెరటముల వలె ఒకదానివెనుక నొకటిగా తరుముకొనివచ్చు చుండుటచే నట్టి సంసారములో తిరిగి పడకుండా శాశ్వత విమోచనము కావలెనని మానవుడాసించుచున్నాడు. ఐతే సంసారకారణమును విడువక దేనిని విడచిననూ ప్రయోజనము లేదు. కారణము శేషించినచో, యాదవకులమునకు ముసలమువలె మరలమరల సంసారమును కల్గించుచుండును. బంధమోక్షములు మిథ్య అన్నచో ఏతత్కారణమున్న మిథ్యారూప భ్రాంతియే కావలసి యుండును. కనుకనే "శ్లో॥ భ్రమేణాహం, భ్రమేణత్వం, భ్రమేణోపాస కాజనాః భ్రమేణీశ్వర భావత్వం భ్రమమూల మిదంజగత్"॥ అని చెప్పబడినది. దేని కీ భ్రమలు కలుగుచున్నవియో విచారించినచో నాకే యీ భ్రమలన్నియు కలుగుచున్నవి. నేనేసర్వ భ్రమలకు మూలమై యున్నాను. ఆ నేనే పైన చెప్పబడినరీతిగా ఏకముగానూ అనేకముగానూ వుంటూవున్నాను. కనుక నన్ను నేను విడువవలెను అని తీవ్రముగా కోరుకొనుటయే ముముక్షుత్వము.

## కర్మ జరుగు పద్ధతి

ప్రతిశరీరము నందునూ రెండు శక్తులు పనిచేయుచున్నవి. (1) జ్ఞానశక్తి (2) క్రియాశక్తి. సకల కర్మలకు యీ రెండు శక్తులే ఆధారముగా నున్నవి.

1. ***జ్ఞానశక్తి వ్యవహారము:—*** శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వా, ఘ్రాణము అను జ్ఞానేంద్రియములద్వారా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ విషయములను తెలుసుకొని, వానియొక్క మంచిచెడ్డలు, మనోబుద్ధి చిత్తా హంకారములను అంతఃకరణ చతుష్టయము ద్వారా నిర్ణయించును.

2. ***ప్రాణశక్తి వ్యవహారము:—*** క్రియాచరణ వ్యాపారమున కంతకూ ప్రాణశక్తి ఆధారముగా నున్నది. ప్రాణశక్తి లేనిచో

భావనారూప మాత్రముగానుండి స్వప్నతుల్యముగానుండును. ఏలననగా మనోమయ విజ్ఞానమయకోశములే పనిచేయునుగాని ప్రాణమయకోశము పనిచేయుటలేదు. పంచప్రాణములు కర్మేంద్రియములు గలసి ప్రాణమయకోశము. భుజించిన అన్నపానాదులను పచనముగావించి సర్వనాడులకు సమానరూపంగా పంచియిచ్చునది, వ్యానరూపంగా శీతోష్ణములను గుర్తించునదీ, ఉదానరూపంగా పల్కునది, ప్రాణరూపంగా వుచ్ఛ్వాస నిశ్వాస రూపంగా రక్తమును శుద్ధిపరచునది, అపానరూపంగా మలిన పదార్థమును శరీరమునుండి విసర్జన గావించునది యీ ప్రాణ శక్తియే. ఈ విధముగా శరీరమును ధరించి భరించుచున్నది. అట్లే కర్మేంద్రియముల ద్వారా వచనదానగమన ఆనంద విసర్జన క్రియలు గావించునదియును యీ ప్రాణశక్తియే.

ఈ విధముగా కర్మజరుపుచు అయా కర్మ ఫలానుభవముతో ఆనందించవలెననే ఆశతో అంతఃకరణ మెదురు చూచుచుండునుగాని ప్రారబ్ధములోలేని సుఖదుఃఖములు అనుభవమునకురావు. అందుదృష్ట ఫలమే ప్రస్తుతము సిద్ధించును గాని అదృష్టఫలము ముందెప్పుడోగాని సిద్ధించదు.

## దృష్టఫల నిర్ణయము

దృష్టఫలమనగా, ఈ జన్మమందు చేసిన కర్మకు యీ జన్మమందే కల్గు ఫలమునకు దృష్టఫలము లేక ప్రత్యక్ష ఫలము. ఇందు సాధారణంగా కారణకార్య సంబంధము తెలియబడుచునే యుండును. అనగా యిపుడు కల్గిన ఫలము అంతకుపూర్వం చేసిన కర్మకు ఫలమని తెలియబడుచుండును. ఏలననగా కారణరూప కర్మకున్ను ఏతత్ఫలితమునకును విశేషకాల వ్యవధి యుండదు. ఎట్లనగా నిప్పుపై చేయివేసిన వెంటనే కాలుచున్నది. అట్లే చోరుడు పట్టుబడినచో వెంటనే శిక్షాభాజనుడగుచున్నాడు.

"అపుత్రస్య గతిర్నాస్తి" అని నమ్మి పుత్రసంతానము కొరకు ఒక యువతిని పెండ్లాడును. భార్యసంతానవతి కానిచో తీర్థయాత్రలు నాగప్రతిష్ఠలు గావించును. అప్పటికిని సంతానప్రాప్తి కాకపోవచ్చును. ఫలనగా గర్భధారణ అయినచో అది స్త్రీపురుష సంబంధమునకు దృష్ట ఫలమని చెప్పవచ్చునుగాన సంతానము కలుగనిచో స్త్రీపురుష సంయోగమే జరుగలేదని చెప్పజాలము. కనుక సంతానప్రాప్తి దృష్టాదృష్ట ఫలమని చెప్పవలసి వుండును. సంతానమువల్లనే పుణ్యగతులున్నవని నమ్మిన వ్యక్తి భార్యయందు సంతానప్రాప్తి లేనిచో యితరుల సంతానమును దత్తుచేసుకొనును. అందువలన తన వంశాభివృద్ధిగావచ్చును. అది దృష్టఫలమని చెప్పవచ్చును. కాని ఆదత్తపుత్రుడొనర్చు శ్రాద్ధాది కర్మల ఫలితంగా దృష్టఫలమేమిన్ని లేదు. ఈ జన్మలో చేసిన కర్మలకు యీజన్మలోనే ఫలప్రాప్తి లేకపోవచ్చును. కాని చేసిన కర్మయున్ను ఎప్పుడున్ను వృధాగాపోదు. దానినే అదృష్టఫలము అందురు.

దృష్టఫలము కూడా ప్రారబ్ధములో అనుభవించవలసి వుండిననే గాని కలుగనేరదు. జైలుశిక్ష ప్రారబ్ధములో వున్నపుడే నేరస్తుడు పట్టుబడుటయు శిక్షింపబడుటయు జరుగును. నిజముగా నేరస్తుడై యుండినను ఆశిక్ష ననుభవించు ప్రారబ్ధము లేనిచో ఆతడు పట్టుబడడు. అథవా పట్టుబడినను నేరము రుజువుకాక ఆతడు నిర్దోషిగానే యెంచబడి విడుదల పొందును. దృష్టఫలము లన్నిటికి కారణమేదో కన్పడుచుండుటచే అది ప్రారబ్ధఫలమని మనమనుకొనకపోవచ్చును. ప్రారబ్ధమందులేని సుఖదుఃఖాదులు యీజన్మలో ఎంత ప్రయత్నించినను రావు. ఈ జన్మలో దరిద్రబాధయు దుఃఖము ననుభవించవలసిన ప్రారబ్ధముతో బుట్టిన విద్యారణ్యుడెంత తపస్సు చేసినను లక్ష్మీకటాక్షము కలుగలేదు. సన్యాసము తీసుకొని జన్మమార్చిన పిమ్మటనే ఆయనకు రాజ్యాధిపత్యము లభించెను. కాని రాజ్యాధిపత్యము లభించిననూ ఆసన్యాసము తీసుకొని యుండిన కారణమున ఆరాజభోగము లనుభవింప నిషేధముండుటచే ప్రారబ్ధములో లేని సుఖమునాతనికి లభించనేలేదు.

అదేవిధముగా సుఖరూపప్రారబ్ధ మనుభవించవలసి యుండిన జనక మహారాజునకు దుఃఖజీవితము ననుసరించుదామని ప్రయత్నముచేసినా ఆ దుఃఖము ననుభవించకుండా ఆయన సుఖప్రారబ్ధ మడ్డుతగిలెను. ఎట్లనగా బ్రహ్మవిద్య నేర్చుకొనుటలో చిన్నతనమున జనకునకు సహాధ్యాయియై తర్వాత బ్రహ్మచర్యము నుండియే సరాసరిగా సన్యాసాశ్రమ స్వీకారము చేసిన సన్యాసి జనకుని చూడవచ్చి ఆయన భోగలాలసుడై పోయెనని అపోహతో జనకుని అధిక్షేపించెను. ఏకోరికయు లేకనే యదృచ్ఛగా లభించిన రాజభోగము లనుభవించుచుంటినే గాని, నిజముగా నేను సంపూర్ణముగా విరాగినై య్యే యున్నానని జనకుడు చెప్పిన సమాధానము సన్యాసి నమ్మక, నీవు నిజముగా సన్యాసివే యగుచో, సర్వాలంకారములు విసర్జించి కాషాయము ధరించివచ్చి తన వైరాగ్యము ఋజువు చేసికొమ్మని సవాలుచేసెను. జనకు డంగీకరించి సన్యాసివేష మవలంభించి సహాధ్యాయితో అరణ్య సంచారము చేయుచూ అలవాటు లేనివాగుటచే కొంత తడవునకు డస్సి ఒక చెట్టు క్రింద మూర్ఛపడిపోయెను. నీటికై సహాధ్యాయిపోగా యీలోగా జనకుని సామంతరాజొకడు వేటకువచ్చి జనకుని గాంచి తోడ్కొని పోయి శైత్యోపచారములచే సేదదీర్చి తూగుటుయ్యాలలో పరుండబెట్టి జనకునికి దాసదాసీజనముచే సమస్త పరిచర్యలు గావించు నేర్పాట్లు చేసెను. దుఃఖము ననుభవించుటకై రాజ్యపరిత్యాగముచేసి అడవుల తిరుగుట కుపక్రమించిన జనకుని దుఃఖానుభవము లేకపోగా మహారణ్యమునకూడా రాజభోగములే తటస్థపడెను.

ప్రారబ్ధములో నుండిననేతప్ప దృష్టఫలముగూడ గలుగజాలదు. కనుక ప్రారబ్ధమే దృష్టఫలము అని వర్ణించనగును.

## అదృష్టఫలము

ఈ జన్మయందు చేసిన కర్మకు ఫలమేమియు కలుగక నొక సంస్కారమును, అపూర్వమును సృష్టించి రానున్న జన్మలలో ననుభ

వించుటకై నిల్వవుండిన ఆగామికర్మఫలమే అదృష్టఫలము. ఈ ఆగామి ఫలం కాలచక్ర కర్మచక్ర నిర్ణయాను సారంగా తదనంతర జన్మలలో ఫల ప్రాప్తికివచ్చి అనుభవింపబడును. విత్తనము భూమిలో పాతినను అది వెంటనే మొలువక దాని కాలానుసారముగానే అది మొలుచును. అన్న దాన, గోదాన, భూదాన, హిరణ్యాదానములు చేసిన వారికి తత్ఫలము యీ జన్మయందే కలుగక మరుజన్మలయందు కోటి గుణితమై కలుగు ఫలప్రాప్తియే అదృష్టఫలము. ఈ జన్మలోకల్గు సుఖదుఃఖములు గత జన్మార్జిత పుణ్యాపాప కర్మల అదృష్టఫలము అని తెలియనగును. రామయ్యవంటి అయోగ్యునికి యీ ఆకస్మిక ధనప్రాప్తి రానేల? తోడివారందరినీ ప్రేమించుచూ తన సర్వస్వము లోకసేవకై వినియోగించు వెంకయ్య కీకష్టపరంపరలేల రావలెను? వారివారి పూర్వాపూర్వ జన్మలలో చేసుకొన్న పుణ్యాపాపములు యిపుడు ఫలప్రాప్తికి వచ్చినవని చెప్పకతప్పదు. ఇదే అదృష్టఫలము. దీనియందు హేతుఫల సంబంధ మేమియు గానరాదు. పూర్వజన్మలయందు ఆగామీగా నుండిపోయిన కర్మఫలము యీ జన్మయందు ప్రారబ్ధ రూపముగా భుక్తికి వచ్చినదని తెలియవలెను.

## బ్రహ్మసంపదుపాసన

ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక పద్ధతులుగా వుపాసన త్రివిధమై వున్నది అందు ఆధిదైవిక పద్ధతిగా అధిష్ఠానచేతన బ్రహ్మమును తెలియుటకు చేయువుపాసన శ్రేష్ఠమనియు, దానివలన జన్మరాహిత్యమగు ననియు కొందరనుచున్నారు. దీనికి బ్రహ్మసంపదుపాసన యనిపేరు. దీనికే అంగుష్ఠప్రమితి విద్య అనికూడ పేరు.

ఉపాసన అనగా ఉపాస్యమునుండి మనస్సును వేరుగానీయకుండా వుపాసకుడు అవిచ్ఛిన్న తైలధారవతుగా చేయు ధ్యానమునకు వుపాసన యనిపేరు. వుపాస్యము యొక్క సన్నిధియందు తన మనస్సు

స్థిరాసనమందు నిలచుటయే వుపాసన బ్రహ్మసంపత్తిని గలిగించగల వుపాసన గనుక దీనికి బ్రహ్మసంపదుపాసన యనిపేరు వచ్చినది. అనగా దీనివలన అధిష్ఠానచేతన బ్రహ్మము తెలియబడునన్నమాట. జీవుల హృదయమున ఆయధిష్ఠానచేతన పరబ్రహ్మము అంగుష్ఠమాత్రపు కొలత గలదియై అనగా సుమారు ఒక అంగుళము కొలత గల ప్రదేశములో "ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశే అర్జున తిష్ఠతి" అని చెప్పబడిన ఈశ్వరుడనే పేరుతో నిలచియున్నాడు. అట్టి అంగుష్ఠమాత్ర పురుషుడే బ్రహ్మాండముల నన్నిటిని అధిష్ఠించి అధిష్ఠానచేతన బ్రహ్మమనే పేరున వ్యవహరించుచున్నాడు. తన కత్యంత సన్నిహితమగు దేశమైన తన శరీరములో యీ బ్రహ్మమును దర్శింప చేయునది గనుక దీనికి అంగుష్ఠ ప్రమితి విద్యయనియు పేరు వచ్చినది. ఇది సాధనారూపమైన ముప్పది రెండు బ్రహ్మవిద్యలలోనూ ఒక బ్రహ్మవిద్యఅయి వున్నది.

ఎట్లనగా:— హృదయస్థానమునుండి బయల్వెడలిన 101 నాడులలో తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తర దిశలకుపోవు నాడులు వరుసగా నేత్రశ్రోత్ర, వాక్కు, ఘ్రాణములను యింద్రియములవరకు పయనించును (1) వాక్కు, (2) ఘ్రాణము, (3) నేత్రము (4) శ్రోత్రము అను యీ నాల్గింటికి మనోబ్రహ్మపాద చతుష్టయ మనిపేరు. ఈ నాల్గింటి అధిష్ఠాన దేవతలైన అగ్ని, వాయువు, సూర్యుడు దిగ్దేవతలు వరుసగా అధిష్ఠాన దేవతలైయున్నారు. ఈ అధిష్ఠాన దేవతలకు ఆకాశ లేక అంతరిక్ష బ్రహ్మ పాదచతుష్ఠయ మనిపేరు. ఈ అధిష్ఠాన దేవతల అనుగ్రహము చేతనే మనోబ్రహ్మ పాదచతుష్టయమగు వాక్కు, ఘ్రాణము, నేత్రము, శ్రోత్రము వానివాని కార్యములు జరుపగలుగుచున్నవి. అయితే యీ అధిదేవతలకు చైతన్యసత్తా గలిగించునది ఏది? అధిష్ఠానచేతన బ్రహ్మము యొక్క ప్రకాశమే అట్టిచేతన సత్తాయిచ్చు ననుటలో సందియమేమియున్ని లేదు. ఈ అధిష్ఠానచేతన బ్రహ్మమే పిపీలికాది బ్రహ్మపర్యంతమును ప్రకాశింపచేయుచున్నది. దీనినెరిగిన జన్మరాహిత్యమని అద్వైతము చెప్పుచున్నది.

మనో బ్రహ్మ పాదచతుష్టయ మందలి యింద్రియములను వరుసగా వానివాని అధిష్ఠాన దేవతలగు ఆకాశబ్రహ్మ పాదచతుష్టయము ప్రవర్తింప చేయుననియు ఆకాశబ్రహ్మ పాదచతుష్టయమును అధిష్ఠానచేతన బ్రహ్మ ప్రకాశమే ప్రవర్తింప చేయుచున్నదనియు గుర్తెరుగుచూ ఏకరూపమైన అధిష్ఠానచేతన బ్రహ్మమును ధ్యానయోగమున అనుసంధాన మొనర్చు శే యీ యుపాసనా పద్ధతి—ఇట్టి పాదదృష్టిని పొంది ధ్యానించుటవలన హృదయమందలి అంగుష్ఠమాత్ర పురుషుని యందు జీవుడు లీనమై వూర్ధ్వనాళముద్వారా బ్రహ్మమునుపొంది అమృతత్వము పొందుననీ యీ అంగుష్ఠ ప్రమతివిద్య చెప్పుచున్నది.

కాని యీ బ్రహ్మము కేవలపూర్ణత్వము కల్గియున్న యెడల జీవేశ్వర జగత్తులు సృష్టిస్తితి లయములు పొందక శాశ్వతముగానే వుండవలయును అట్లుండుట లేదు. యిది ప్రత్యక్షముగా ఎచ్చట కచ్చట పూర్ణముగా గోచరించినను, ఆవరణ సహితమై మితములోనే ప్రకాశించు చున్నది. దీనికి సృష్టిస్తితి ప్రళయముకల్గి ఖండఖండములుగా గోచరించుచు ఏకదేశీయముగా వుంటూ మార్పుకు లోబడుచూనున్నది. ఏకరీతిగా మాత్రము లేదు. కేవల పూర్ణత్వమున్ను లేదు. ఏకముగాను ద్వంద్వరూపంగానూ కూడా వుంటూ వున్నది. కనుకనే అనేక మతములకు తావిచ్చినది. కేవల పరిపూర్ణమునకు ఏనిర్ణయములున్నూ లేవు. కనుకనే "కం॥ ఏనిర్ణయమును చేయడు నేనని మహాత్ముడెప్పుడు నేనను వాడే నానావిధాల వదరును నేనను తనవంటివారి నెప్పుడు గనినన్ ॥ అని అచల ఋషులు సిద్ధాంతము చేసినారు.

# యోగఫల నిర్ణయము

యుగమనగా రెండు. రెంటి కూడిక యే లేక చేరిక యే యోగము పారమార్థికమునందు జీవబ్రహ్మైక్య జ్ఞానమును సాధించునదే యోగమని చెప్పనగును. ఇది అభ్యాస యోగమని రాజయోగ (లేక జ్ఞానయోగ)

మని రెండు విధములు. పరిపక్వ చిత్తము గలవానికి వుత్తమాధికారికి కేవలము అనగా బోధచేతనే జీవబ్రహ్మైక్యత నిత్యసిద్ధమై యున్నదని గ్రాహ్యము కాగలదు. యిదియే రాజయోగము లేక జ్ఞానయోగము. కాని మంద మధ్య మాధికారులకు సాధనచేత ముందుగా మనోపరిపక్వత కావించుకొనవలసి వున్నది. అట్టి సాధనారూపమైనదే అభ్యాసయోగ మనబడును. మనోవిక్షేప మడచి మనః శుద్ధి గావించుటకై చేయు సాధనా విశేషములలో ప్రాణాయామ ప్రక్రియ ప్రధానమైనది కనుక అభ్యాస యోగ మనగా ప్రాణాయామముతో గూడిన సాధన యని చెప్పదగును. ఈ అభ్యాస యోగము మంత్ర లయ హఠయోగములని త్రివిధముగా నున్నది.

జీవేశ్వరులకు లేక ప్రత్యగ్బ్రహ్మలకు ఐక్యము స్వతస్సిద్ధమయ్యే వున్నది. అందుకొరకు సాధనయేల ? ఆ రెంటికి మధ్య ఎంత దూరము ? అఖండముగా కలసియే యున్నవానికి మరల సాధనయేమి ? జీవబ్రహ్మలు రెంటి ఐక్యతప్రాప్తించియే యున్నది. అది ప్రాప్తించలేదు ప్రాప్తించ వలసి యున్నది, అని భ్రాంతిలో నున్నావు. అది ప్రాప్తప్రాప్తవ్యము అయి వున్నది. అని వేదాంతులు రాజయోగములేక జ్ఞానయోగము ప్రతిపాదించినారు. అందు జ్ఞాన పంచా దశాంగములు నిర్ణయించినారు. ఇవి కేవలం భావనారూపములు కనుగ యోగముయొక్క ముఖ్యాశయ మైన జీవబ్రహ్మైక్యము ఏ యోగము వల్లనూ క్రొత్తగా సిద్ధించుటలేదు. కనుక యీ యోగముల వలన ప్రయోజనమేమి ? చివరకు సిద్ధించు ఫలితమేమి ? అని యోచిస్తే రాజయోగము లేక జ్ఞానయోగాభ్యాసము వలన ఆజీవబ్రహ్మ లఖండముగా యెప్పుడున్ను కలిసియే యున్నవని ఆరూఢమగుటయే రాజయోగ ఫలము. కాబట్టి రాజయోగి స్వస్వ రూపము మాత్రము నెరుగగల్గుచున్నాడు.

అట్లే మంత్రలయ హఠయోగములుకూడ కేవలం వ్యర్థములు గావు. వానివలన కొన్ని అవాంతర ప్రయోజనములు మాత్రం సిద్ధించు చున్నవి. అవి ఏవనగా

1. ఆయురారోగ్యములు = అష్టాంగ యోగములలో ఆసనము వలన స్థూల శరీరదోషములగు వాతపిత్త శ్లేష్మముల వైషమ్యము తొలగి ఆరోగ్యము సిద్ధించును. ప్రాణాయామము వలన శ్వాసలు (హంసలు) నిలవలోబడి ఆయుర్దాయము పెరుగును.

2. అంతఃకరణశుద్ధి యింద్రియ జయము = యమనియమ పాలన వల్లను ప్రత్యాహారము వల్లను చేకూరును.

3. ఏకాగ్రత = ధ్యానధారణల వలన మనోచాంచల్య చిత్త విక్షేపములణంగి ఏకాగ్రత సిద్ధించును.

4. చిత్తవిశ్రాంతి = సమాధివలన నిర్విషయ సుఖరూపమగు విశ్రాంతి లభించగలదు.

5. అణిమాది అష్టసిద్ధుల యొక్కయు యితర మహత్తుల యొక్కయు ప్రాప్తి = కుండలినీ భేదనమై, వీణాదండమనబడే వెన్నెముకలోని సుషుమ్నానాడియనే రంధ్రముగుండా, చక్రస్థానములను, హంస వరుసగానధిరోహించుగొలది అష్టసిద్ధులు, త్రికాలవేత్తృత్వము, పరకాయప్రవేశము ఆకాశగమనము మొదలైన కోరిక లన్నియు చేకూర్చుకొనవచ్చును. రాజయోగి అంతయు అఖండాత్మ స్వరూపమేయని, నామరూపాలు మిధ్యయని ఆరూఢతగాంచును. ఆతనికి పైన జెప్పిన యోగసిద్ధులతో ఏమియు ప్రయోజనమేలేదు. వానితలంపే యాతని కుదయించదు. ఏలననగా సర్వము తానైనవానికి, ఏసిద్ధి ఎవనిపైన యెందుకొరకు వినియోగించవలెను ?

కనుక యీ సిద్ధులు, మహిమలు, ఖ్యాతి, లాభ, పూజార్ధమేగాని జన్మమరణ భ్రాంతి నివారకములుగావు. పరమాత్మ సృష్టిలో చిత్రాతిచిత్రమగు శక్తులు, మహత్తులు క్షుద్రప్రాణులయందు కూడ నున్నవి. త్రాచుపాము శిరోభాగమునకోట్ల రూపాయీలు విలువగల మాణిక్యము, మదపుటేనుగు కుంభస్థలమున ఆణిముత్యములను గల్గించినాడే! కోడికి కాలజ్ఞానము, చీమకు దివ్యజ్ఞానము, కుక్కకు బ్రహ్మజ్ఞానము యిచ్చి

నాడే! చేపచూపు, తాబేటితలపు, పక్షిస్పర్శల కెంత ప్రభావము అప్రాకృతమైన శక్తులు కల్పించినాడో! ఇట్టి అనంతానంత అద్భుత శక్తులు గల పరమాత్మయే తానై వున్నానని రాజయోగి గుర్తెరిగి అటుపిమ్మట యెట్టి భ్రాంతికి లోనుగాకుండా గురుపాదము లాశ్రయించి గురుకృపా పాత్రుడై జన్మతరణోపాయము సాధించుటే కర్తవ్యమని తెలియ వలయును.

## జన్మరాహిత్యమునకు మార్గమేమి?

పైన దెలుపబడిన మంత్ర, లయ, హఠ, రాజయోగములు జన్మరాహిత్యమునందు సమర్థములుగావు. అట్లే తారక, సాంఖ్య, అమనస్కములు, గాని మహావాక్యార్థ విచారణగాని, వార్తిక సిద్ధాంత పద్ధతులుగాని జన్మరహితమును సాధించజాలవు. ఏలననగా జన్మకారణమును తొలగించినగాని జన్మరహితము సిద్ధించదని వేరేచెప్ప పనిలేదు. ఎవని సంకల్పమున యీ జీవ జగత్తులు నిర్మాణమయ్యెనో ఆసంకల్ప పురుషుడు మిగిలియున్నచో మరల సంకల్పించుచునే వుండగలడు. "ఇచ్ఛా మాత్రప్రభుస్సృష్టిః అన్నారు. ఆప్రభువు "అహం బహుస్యాం" అని సంకల్పించినపుడు జీవులు వారివారి పూర్వసంచిత కర్మవిశేషములతో వుపాధి దాల్చెదరు. కనుక ఎట్టి సంకల్పములు చేయుటకున్న తనయందు యెరుకయేలేని పరిపూర్ణ పరబ్రహ్మమొకటున్నదనీ, దానియందు సంకల్ప రూపమగు యెరుకకు స్థానముగాని మూలముగాని లేదని గురుముఖతః గుర్తెరుగవలెను. అపుడు యిక యెరుకయొక్క స్థానస్వరూప స్వభావములున్ను యెరుక రహితమగు విధానమున్ను గురుకృపపాత్రుడై పరిపూర్ణబోధ ద్వారా తెలియవలెను. ఆపిమ్మట ఆసంకల్పపురుషుడే బ్రహ్మమనే భ్రాంతివిడచి, ఆగామిరహిత విధానముతో శేషజీవితమందు కర్మాచరణ గావించి తనువు విడచిననాడే, వేయించిన విత్తనము మరల మొలకెత్తలేనట్లు, నిర్బీజమైవున్న భ్రాంతి రహితం కాగలదు.

# ఆగామీరహిత విధానము

అపేక్ష = అప + ఈక్ష = అపేక్ష. కనుక అపేక్ష అనగా తప్పు చూపు అని అర్థము. అనగా పొరపాటు, లేక భ్రాంతి అని అర్థము.

సంతాన ప్రాప్తివలన, దానధర్మాదుల వలన, స్వర్గాదిపుణ్యాలోకములు తనకు సిద్ధించగలవని భావించుట భ్రాంతి, తనకు పూర్వపుణ్యము లేనందున భోగభాగ్యము లీజన్మలో తనకు సిద్ధింపలేదని, సంగీత సాహిత్య పాండిత్యములు తనకు లేకపోయెనే యనియు, సన్యాసము గైకొన్నవారు అనేక సాంప్రదాయక నామములతో లోకమునందు పాదపూజ లందుకొనుచు రాజాధిరాజులకు కూడ నందని మహా వైభవముతో తిరుగుచున్నారే అట్టి వైభవము నాకు లేకపోయెనే యనియు వాపోవుట కూడ భ్రాంతి లక్షణమే. ఈ ధనకీర్తి ప్రతిష్టలు, సత్కారమాన పూజాదులు యివన్నీ యెరుకచేయు మర్యాదలే. అవన్నియు వమనాన్నంవలె విసర్జనీయములే. జన్మరాహిత్య మాసించువారిందు యే భ్రాంతికీ చోటివ్వరు. "కేవల మోక్షాపేక్ష సంకల్పోబంధః" అను శ్రుతి వాక్యానుసారముగా, సర్వసంకల్పములకు మూలమైన సంకల్ప పురుషడవు నీవే అయివుండియు, ఆ విషయము మరచి, ఆపురుషు డెక్కడున్నాడో ఆస్థానమే మోక్షమని అది నాకు కావలెనని కోరు మోక్షాపేక్షకూడ తప్పుచూపే. భ్రాంతియే. యెట్టికోరికలు మనస్సునందుండినను అతడు పూర్ణాధికారి కాజాలడు. కనుకనే "రోసితి మోక్షాపేక్ష, రూఢిగ వినుమీ, నీవిట్టి యారూఢతగనుమీ" అని పెద్దలు హెచ్చరించుచున్నారు.

ఏసంకల్పములేని, అచల పరిపూర్ణ పరబయలును, గురుముఖతః తెలసి యెరుకలేక సేవించిననే అట్టి ఆరూఢత గలుగును. ఆపిమ్మట శేషజీవితమంతయు కర్తృత్వ రహిత కర్మాచరణ విధానము బూని గడపవలెను. కనుక జననమరణ ప్రవాహము నింకింప గోరువారు

ప్రధమంలో, కం॥ ఏయాపేక్షజనించిన, ఆయాపేక్షలెల్ల మాయయని తెలియదగున్ ఆయాసమౌను దానను, ఛీయని అదివిడువదగును క్షేమము కొరకై ॥ (2) గురుముఖతః పరిపూర్ణబోధను వస్తునిశ్చయముగా నెరిగి యెరుకలేక సేవింపదగును. (3) "ఎరుక యనియెడి ఆటాడించేటివాడు అతడేర కర్తా" యని సర్వకర్తృత్వముగల వస్తువు ఆ పరమాత్మ అగు తానేయని దెలసి కర్తృత్వము లేక కర్మలొనర్చుచుండవలెను. (4) ఐనను పరమాత్మ నిర్ణయానుసారమే సకల కర్మలు చేయుచుండవలెను.

అట్లుగాక, మేము తీర్ణుల మైతిమని, ఆత్మవంచన చేసుకొని గురువులగువారు తాము చెడినదేగాక తమ్మాశ్రయించిన వారిని గూడ అధోగతి పాల్జేతురనుట స్పష్టము.

# సృష్టిప్రతికూల పద్ధతులు అనర్ధదాయకములే

సృష్టి నిర్ణయమునకు ప్రతికూలంగా ప్రవర్తించిన విశ్వామిత్రుని వంటి మహాతపస్వులేగాక బ్రహ్మ, విష్ణు మహేశ్వరులు మొదలగువారే అపహాస్యముపాలైన యుదంతములు పురాణములయందు కొల్లలుగా నున్నవి.

(1) విశ్వామిత్రుడు,—త్రిశంకుని స్వర్గాపేక్ష సఫలీకృతముగావించుటకై తనతపోబలముచే త్రిశంకుని స్వర్గమున కెక్కించెను. దేవతలా త్రిశంకుడు స్వర్గనివాసమున కనర్హుడని క్రిందికి నెట్టివేసిరి. తల క్రిందుగా భూమిపై పడిపోవుచున్న త్రిశంకుని అంతరాళముననే ఆపి అచటనే త్రిశంకునికి తనతపస్సంతయు ధారబోసి మరియొక స్వర్గమును విశ్వామిత్రుడు సృష్టించెను. తనతపస్సంతయు ఆ విధముగా వినియోగించుటవలన విశ్వామిత్రుడు దివాళాతీసిన షావుకారువలె నైపోయెను.

(2) త్రిమూర్తులు, పతివ్రత యయిన అనసూయ పాతివ్రత్యమును చెరపుటకు పూనుకొని, ఆమెపతివ్రతా మాహాత్మ్యమువలన పసిబాలురై ఆమెయింటనే నిలచిపోవలసి వచ్చెను. అనసూయ కరుణించి సరస్వతీ లక్ష్మిపార్వతులకు తిరిగి పతిభిక్షపెట్టువరకు దిక్కులేకపోయెను.

కనుక పరిపూర్ణ భావజ్ఞులు తమ ప్రవర్తనయందు బహుజాగరూకులై పరమాత్మ సృష్టివిధానమునకు వ్యతిరిక్తముగాని కర్మాచరణయే చేయవలెను:

# ద్వయదోషము

"ద్వితీయాద్వై భయంభవతి" అనగా ద్వయముంటే భయం తప్పదు. సూర్యచంద్రాదులయందు మాత్రమేగాక అధిష్ఠానచేతన బ్రహ్మమందు కూడ ద్వయదోషమున్నది. కేవల ఏకత్వమనునది మృగ్యము. ఎట్లనగా సూర్యుడు తనకిరణ ప్రసారముచే సకల జీవోపాధులకు ప్రాణసత్తా నొసంగుచున్నాడు. తన తేజస్సును ప్రసరింపచేసి భూమిని సారవంతము గావించుచున్నాడు. సముద్రమందలి నీటిలోని వుప్పును విసర్జించి మంచినీటిని మాత్రమే గ్రహించి మేఘరూపం చెందించి వర్షరూపంగా ప్రాణుల కనుగ్రహించుచున్నాడు. ఆతని దివ్య ప్రకాశమునందే సర్వులు తమతమ దైనందిన కార్యములు నిర్వర్తించుకొనుచున్నారు. ఐనను ఆతని తీవ్రవుష్ణోగ్రతకు వేడిగాడ్పులకు ప్రాణులు తహతహ లాడిపోవుచున్నారు. అందు కొన్ని ప్రాణులు నశింపు చెందుచున్నవి. సూర్యుడావిధముగా సుఖదుఃఖముల రెంటికీ కారణభూతుడగుచున్నాడు. అట్లే చంద్రుడు లోకమునకు చల్లని వెన్నెలనిచ్చి హాయిని గల్గించుచున్నాడు. ఓషధులను పోషించుచున్నాడు. మనస్సునకధిష్ఠాన దేవత అయివుండి మనస్సున కెంతో ఆహ్లాదము కల్గించుచున్నాడు గాని కామోద్రేకము గల్గించి స్త్రీపురుషులను బాధించుచున్నాడు. దుష్టప్రవృత్తిని వారియందు రేకెత్తించుచున్నాడు. యజ్ఞ

యాగాది క్రతువు లొనర్చినవారు యోగాభ్యాసపరులు చంద్రలోకము నకు పోదురని కేవల జ్ఞానమార్గీయులు సూర్యలోకము పొందుదురని కొందరు చెప్పుచున్నారు. కాని ఆయాలోకములందు సహితం సుఖదుఃఖ హేతువులైన ద్వయలక్షణములున్నవి. అట్లే జ్ఞానాజ్ఞానములు, లేక యెరుక మరుపులకు, ఆవాసమైన అధిష్ఠాన చేతన బ్రహ్మస్థానము సహితము. ద్వయదోషముతో గూడియే యున్నది. కేవలత్వము ననదొక్క పరిపూర్ణ బ్రహ్మమునందే. సర్వద్వంద్వవి రాహిత్యం అని అందుచేతనే కీర్తింపబడు చున్నది దానియందు ద్వయదోషములున్న యెరుకకు మూలము గాని స్థానముగాని లేదు.

## గ్రంథ సమాప్తి

పరమాత్మయొక్క సృష్టి సంకల్పానుసారముగా యితర జీవులతో పాటు వుపాధి వహించిన మానవులు తమపూర్వ సంస్కార ప్రేరేపణచే సంకల్పముకల్గి పుణ్యాపాపకర్మ లాచరించుచున్నారు. ప్రారబ్ధానుభవముచే కొంతకర్మ క్షీణించుచున్నను, నూతన కర్మాచరణచే మరల పుణ్యాపాపము లను సంచిత కర్మలో చేర్చుకొంటూ "పునరపి జననం పునరపి మరణం" అనే న్యాయంగా జన్మమరణ ప్రవాహంలోబడి కొట్టుకొనిపోవుచు దరి గానలేకున్నారు. అందు కొందరికే పూర్వపుణ్య లేశముచే, కర్మ భక్తి జ్ఞానవైరాగ్యాది పద్ధతులయందో, మహావాక్య సిద్ధాంత వార్తిక సిద్ధాంత పద్ధతుల యందో ప్రవృత్తి కలిగి కృషిచేసిన వారగుచున్నారు. కాని జన్మతరణోపాయము మాత్రము చిక్కుటలేదు. చతుర్దశ లోకములేగాక అన్నిటిని మీరియున్నదనే గోలోక పర్యంతమూ వున్న జ్యోతిర్లోక ములు. నక్షత్రలోకము మొదలగు సమస్తలోకములూ ఆకాశావరణము నందే వున్నవి. స్థలమాక్ర మించని లోక ముండదుగదా! "లోక్యత యితిలోకః" అని లోకశబ్దమునకు నిర్వచనము. చూడదగినది లేక వూహించదగినదే లోకము వూహకందనిదే మాత్రమూకాదు. ఏలోక

మేగినా, ఎండు కాలిడినా, "క్షీణే పుణ్యేమ ర్త్యలోకం విశంతి" అని యీ మట్టిలోకంలో మరల పుట్టవలసినదేనని యెరుగవలెను.

అద్వైత సాంప్రదాయకమునందు, నదీప్రవాహములు సముద్ర జలములతో ఐక్యముపొంది నామరూపాలు గోల్పోయి తిరిగి యెటుల రాజాలవో, అట్లే బ్రహ్మైక్యము చెందినవారు తిరిగి పుట్టరని చెప్పబడి నది. కాని యిది సరిగాదు దృష్టాంతమున్నూ సరిగాదు నదీజలములు సముద్రములో గలసినను సూర్యుని వేడిమికి ఆవిరిరూపమై మేఘమై, వర్షమై తిరిగి నదుల రూపంగా ప్రవహించుటలేదా ? ఐక్యము చెపితే, అనైక్యస్థితినుండి ఐక్యస్తితికి, మరల ఐక్యస్తితినుండి అనైక్యస్తితి యునూ చెప్పవలసినదే ! బ్రహ్మమునుండియే సృష్టిఅన్నపుడు బ్రహ్మము నందు తిరోభావను చెందిన సృష్టిమరల ఆవిర్భావము చెందుచున్నది. ప్రకటమగుట, దాగియుండుట మాత్రమేగాని ఏజీవియు స్వరూప నాశనము నొందుటలేదు. బీజము మిగిలి వుండుటచే నామరూపములు మారిననూ వుత్పత్తి స్తితి లయములు తప్పుటలేదు. ముడిబడి కర్మము జ్ఞానము బీజరూపంగా సర్వోపాధులకు కారణరూపంగా నున్నవి. ఆ రెండునూ పూర్ణబోధ సిద్ధాంతము నందలి ఆచరణ విధానముచేత గాని స్వరూపనాశనము చెందవు. అంతవరకు రాకపోకలు తప్పవు. నదీప్రవాహము సముద్రముచేరు లోపుననే యింకిపోవలెను. సూర్యరశ్మిచే యింకిపోవుటగాదు. పుట్టుక స్థానమందే యింకిపోవలెను. అపుడు కొంత దూరమే ప్రవహించి యింకిపోయినను మరల నిక నది ప్రవహించజాలదు. గోదావరి యెడతెగక ప్రవహించుచూ జీవనది యని ప్రఖ్యాతి చెందినది. యిది లేకుండా పోవలెననిన సముద్రములో చేరుట వలన పోవునా ? వ్యుత్పత్తి స్థానమైన నాసికా త్ర్యయంబకమునుండి నీరు వచ్చుచునే వుండును సముద్రమున చేరుచునే వుండును. సాగర సంగమముచే జీవ నదులు నాశన మొందవు అట్లే బ్రహ్మైక్యము వలన జీవులు మోక్షము చెందరు అని గ్రహించవలెను.

అసలు బ్రహ్మము నందైక్యము చెప్పుటయు సరిగాదు. పాల నుంచి తీసిన వెన్న పాలలో తిరిగి ఐక్యము చెందునా ? చిలుకుటలో కరగి పోయి ద్రవరూపం చెందిననూ అది స్వరూప నాశనము పొందక, ఆ జిడ్డు ఆవాసన మొదలగు స్వలక్షణములను గోల్పోవుటలేదు. కనుక జీవబ్రహ్మైక్యమే మోక్షము. జన్మరాహిత్యము అని అంగీకరించవలనుపడదు.

ఇతి శ్రీ అచలఋషి దయానంద పొన్నాల రాజయోగి
విరచిత అనన్యాచల పరిపూర్ణ ప్రబోధ
రాజయోగీయము సంపూర్ణము సర్వం సద్గురుచరణార విందార్పణమస్తు
శ్రీ నిజగురు మహారాజకీ జై జై జై

కం॥ కలమేలుకొన్న పురుషుడు । కలలోపలిబాములెరుక గలిగుండగనే ।
తిలకింప లేవుగురు కృప । తెలివొందిన వానికింక తిప్పాలున్నావే ।
తెల్వర కొద్దిగొప్పాలున్నావే।తలిదండ్రి దొరదాతకులదైవమాప్తులు।
కల బాంధవులు దేశికులని నమ్మితె యింక । తిప్పా లున్నావే ।
తెల్వర । కొద్ది గొప్పా లున్నావే॥

కం॥ ధ్వని మొదలగు తన్మాత్రలు।గనుగొనగా లేశమైన గాన్పించనిచో।
టును బట్టబయలుగాగని।ధ్వని ముఖతన్మాత్ర లున్నదాన్నె యెరుగ
కనూ।గని యీరెంట్లో దేన్ని యెరుగకనూ॥ వునికి గలిగిన యట్టి।
ఘనుని సన్నుతి జేయ । జనులాకు శక్య మంచన రాదు వినరాదు॥
దాన్నె యెరుగకను గని । యీరెంట్లో దేన్ని యెరుగకనూ॥



నిజగురు సాంప్రదాయక పీఠ గ్రంథములు కావలసినవారు

ఈ దిగువ అడ్రసుకు వ్రాసి తెప్పించుకో గలరు

## శ్రీ శివరామ దీక్షిత అచలగురు పీఠం

4-1-96, రాజయోగాశ్రమము

సికింద్రాబాద్-3 (ఆంధ్రప్రదేశ్).